

ప్రాణాయామం పట్టి
ముళ్ళపరుపుమీద పడు-
కోవడం సన్యాసికి చేతనయితే



# లోధ్ర

సేవించి ఆరోగ్య ***
సౌందర్యాలు పెంపొందించు
కొంటూ ఉత్సాహంగావుండ
డము ఆమె చేతనవును.
"లోధ్ర" ఋతు దోషాలను
పారద్రోలి ఆరోగ్య సంతోష
సంతానములను సంప్రాప్తింప
జేయును



## కేసరి కుటీరం లిమిటెడ్,
## రాయపేట, మద్రాస్.

తెలుగు జిల్లాలకు, నైజాముకు, తమిళనాడుకు ఏజంట్లు:

సీతారామ జనరల్ స్టోర్స్, బెజవాడ, సికింద్రాబాదు, మధుర.




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయు వారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రి ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలుచేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్ పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

GRIHALAKSHMI

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

సంపాదకుఁడు :

డాక్టరు కే. యన్. కేసరి

సంపుటము ౨౨]   ఏప్రిల్ 1953   [సంచిక ౪

# విషయసూచిక






జయజయ గృహలక్ష్మి సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతిమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !



# ఆంధ్రరాష్ట్రము - నిర్మాణ కార్యక్రమం



గాంధీజీ నిర్మాణ కార్యక్రమమంటూ అన్నివిధాల దేశము అభివృద్ధిగాంచడానికి ప్రబోధించాడు. ప్రబోధించడమేకాదు – తాను ఆకార్యక్రమాన్ని అనుసరిస్తూ అనేక మందిచేత అనుసరింపజేసి జాతీయ సమరమును విజయవంతంగా నడుపగలిగాడు. ఆనిర్మాణ కార్యక్రమం గాంధీజీ అనంతరము అనుసరించ బడుతున్నదా లేదా అనేది ఎలాగున్నా ఒకటిమాత్రం యదార్థం — ఆనిర్మాణ కార్యక్రమం దేశముయొక్క శ్రేయస్సునకు, అభ్యుదయానికి మహోత్కృష్టమైనదేకాక మహోపయోగమయ్యినది కూడాను. అట్టి నిర్మాణ కార్యక్రమాన్నే ఏర్పడనున్న ఆంధ్రరాష్ట్రపురోభివృద్ధికి యావదాంధ్రదేశం అమలు పరచడం ఎంతైనా అవసరం.

ఇక ఆంధ్రరాష్ట్ర నిర్మాణము కానున్న యీసమయంలో ప్రజలు, ప్రజాప్రతి నిధులుగా శాసన సభకు ఎన్నిక అయినవారు ఏనిర్ణయం చేసినా, ఏకార్యక్రమము

నమలుపరచినా జాతీయ దృష్ట్యా నిర్మాణాత్మకంగా అభ్యుదయ ధోరణి ననుసరించాలి.

రాష్ట్రనిర్మాణ సందర్భములో అనేక క్లిష్టసమస్యల నెదుర్కొనవలసి యుంటుంది. కుల, మత, వర్గ, రాజకీయాలను విస్మరించి విశాల దృష్టితోటి వ్యక్తిత్వానికి లోపం లేకుండా వివిధ సమస్యలను పరిష్కరించుకోడానికి, అవసరమయితే అఖండ త్యాగాలు చేయవలసి యున్నది.

ఇంతకాలమునుండి మద్రాసు రాష్ట్రంలో కలసి యుంటున్న తెలుగుభాషా ప్రాంత్యాలు ప్రత్యేకంగా రాష్ట్రంగా ఏర్పడనున్న యీసమయంలో తెలుగుజాతికి అన్యాయం జరుగకుండా వెయ్యికండ్లతో గమనించవలసిన బాధ్యత ప్రతియొక్క ఆంధ్రుడిపై కలదు.

ముఖ్యంగా ఏర్పడనున్న ఆంధ్రరాష్ట్రంలో న్యాయంగా తెలుగుభాషా ప్రాంత్యాలన్నీ చేర్చబడుతున్నవా? ఆస్తిపాస్తుల పంపకం విషయంలోను, నష్టపరిహారం చెల్లింపు విషయంలోను ఉద్యోగుల పంపకం విషయంలోను జరుగ వలసిన న్యాయం జరుగుతున్నదా? మొదలయినవి గమనించ తగినవి.

ఈసందర్భములో మద్రాసు నగరం భవిష్యత్తు తేలకుండానే రాష్ట్రనిర్మాణం జరుగనుండటం ఆంధ్రులకు నిరుత్సాహకరంగానున్నా రాష్ట్ర నిర్మాణానంతరము సయితం మద్రాసు నగర భవిష్యత్తును గురించి వేయి కండ్లతో గమనిస్తూ, నగరంలోని ఆంధ్రుల సాంస్కృతిక, రాజకీయ, సాంఘిక పరిస్థితుల యెడల అత్యంత శ్రద్ధ వహించి వారి న్యాయమైన హక్కులకొరకు జరుగనున్న పోరాటమునకు ఏర్పడనున్న ఆంధ్ర రాష్ట్రం సంపూర్ణ సహకార మివ్వాలి. వారిని తమతోపాటు అన్నిరంగాలలో ప్రోత్సాహపరుస్తూ వారి అభ్యుదయము, అభివృద్ధి తమతోటివాటుదని భావించి వ్యవహరించాలి.

మద్రాసు నగరమును గురించే కాదు-మిగిలిన మద్రాసు రాజధానిలోని తెలుగు భాషాప్రాంతాలను - మైసూరు, ఒరిస్సా రాష్ట్రాలలోని తెలుగు ప్రాంతాలను వీలైనంత త్వరగా ఆంధ్రరాష్ట్రంలో చేర్చడానికి నిర్మాణాత్మకమైన కృషి, కార్యక్రమం అవసరం. ఇందుకుగాను ఒకప్రత్యేకమైన సంస్థ ఏర్పడాలి. ఆసంస్థ ఏర్పడనున్న ఆంధ్ర రాష్ట్రమునకు బయటనున్న తెలుగుభాషా ప్రాంత్యాలను, ప్రజలను సంఘటితపరచి

ఆ ప్రాంతీయులు తమ వ్యక్తిత్వాన్ని గుర్తించుకొని తమ పురోభివృద్ధి దృష్ట్యా ఆంధ్ర రాష్ట్రంలో చేరేలాగ ప్రచారము, కృషి జరుగాలి. ఆనాడుకాని అది సమగ్రమైన రాష్ట్ర మనిపించుకోదు; ఆనాడుకాని అది చిరకాల వాంఛితమైన ఆంధ్రరాష్ట్రంకాదు.

శ్రీ ఎ. లక్ష్మణస్వామి మొదలియార్‌గారు మద్రాసు లెజిస్లేటివు కవున్సిలులో ఎప్పటియట్లు ఆంధ్రరాష్ట్రము నిర్మాణం జరిగిన తర్వాతకూడ తెలుగువారికి విద్యా సౌకర్యాలను మద్రాసు విశ్వవిద్యాలయము సమకూరుస్తుందని ప్రకటించినా మద్రాసు ప్రభుత్వము అప్పుడే మద్రాసు నగరంలోని విద్యాలయాలలో తెలుగుభాషను తీసివేయ డానికి ఆలోచిస్తున్నట్లు వార్తలు వస్తున్నవి. అంతటితో మాత్రము ఆగుతుందను కోడం భ్రమ ; రాజకీయ, వర్తక వ్యాపారాది రంగాలలో సయితం నగరంలోని తెలుగువారి హక్కులకు, అవకాశాలకు భంగం కలుగవచ్చును. ఈ పరిస్థితులలో నగరంలోని తెలుగువారు ప్రాంతీయవారీగా సంఘటితపడి, అన్ని ప్రాంతాలవారు కేంద్ర సంఘము నేర్పరచుకొని తమ వాస్తవిక జనాభా దృష్ట్యా సాంస్కృతి, సాంఘిక, రాజకీయాది రంగాలలో తమకు న్యాయం కలిగేలాగ నిర్మాణ యుక్తంగా కృషి చెయ్యాలి. తమ హక్కులు, కోర్కెలు న్యాయ, ధర్మ సమ్మతములయినప్పుడు ఎట్టి త్యాగాలకయినా సంసిద్ధులు కావాలి. ఆనాడు తమతోడి నగర ఆంధ్రులకు ఆంధ్ర రాష్ట్ర ప్రజానీకపు సహకార సానుభూతులకు కొరతయుండదు.

ఆంధ్రరాష్ట్రపు రాజధానితోబాటు హైకోర్టుకూడ మద్రాసు నగరమును వదలి పోయిననాడు యీ నాటి నగరంగా నుండదనుమాట యదార్థం. పైగా ఆంధ్ర తమిళ ప్రాంత్యాలకు మధ్యగా నున్నది కాబట్టి మద్రాసు నగరం ప్రస్తుతపు రాష్ట్రానికి రాజ ధాని నగరంగా వర్ధిల్లింది. తెలుగు ప్రాంత్యాలు విడిపోయిన తరువాత తమిళ రాష్ట్రపు రాజధాని ఏనాటికైనా ఏమధురకో తరలించబడేదేకాని మద్రాసులోనుండదు. ఇదే జరిగితే యీ నాడు ఎంతోపట్టుదలతో తాత్కాలికపు ఆంధ్రరాష్ట్రపు రాజధాని కూడ మద్రాసులో నుండటానికి సమ్మతించని తమిళసోదరులు కంటున్నవి పగటి కలలుగా మాత్రము నిలిచిపోతవి.

నగరంయొక్క ప్రాధాన్యత తగ్గిపోతుంది. నగరంలోని పెద్దపెద్ద ప్రభుత్వభవ నాలు యించుమించుగా సత్రాలుగా మారుతవి. వర్తక వ్యాపారాదులు సయితం యిప్పుడున్నంత భారీగా జరుగవు. దాని కనుగుణ్యంగా జనాభా తగ్గిపోతుంది. అంటే నగర పురోభివృద్ధి అంతటితో మందగిస్తుంది అన్నమాట. నగరానికి వచ్చేవారెవ

రైనా యాత్రీకులుగా రావలసిందేకాని యిప్పటి ప్రజల రాకపోకలుండవు. ఈ పరిస్థితులలో నగరపు కళాకాంతు లెలాగుంటవో యూహించడం సులభం.

ఈ పై పరిస్థితులనుండి నగరాన్ని నివారించాలంటే మద్రాసు నగరాన్ని చీఫ్ కమీషనరు రాష్ట్రంగా చేయడమే మంచి మార్గం. దాని మూలంగా నగరముయొక్క ప్రాముఖ్యత తగ్గదు. నగరవాసులయిన వివిధభాషావాదులయొక్క హక్కులు, అవకాశాలకు భంగముండదు. నగరపురోభివృద్ధితోబాటు వివిధభాషావాదుల సాంస్కృతిక, సాంఘిక, రాజకీయాది అభివృద్ధులకు శ్వేచ్ఛావాతావరణ ముంటుంది కాబట్టి జనాభా తగ్గుదలకాని, వర్తక వ్యాపారాదులలో మాంద్యమునకుగాని అవకాశముండదు. నగర పురోభివృద్ధిని ఆశించే ఏభాషావాది అయినా మద్రాసు నగరాన్ని చీఫ్‌కమీషనరు రాష్ట్రంగా చేయబడాలనే కోరుతాడు.

ఈ సందర్భంలో ఆంధ్ర రాష్ట్రంలో సుస్థిరమైన ప్రజాస్వామిక-ప్రభుత్వము ఏర్పడటం అవసరం. ఇందుకుగాను శాసనసభలోని వివిధ జాతీయ పక్షాలు సమైక్యంగా సంఘటితపడి రాష్ట్రక్షేమం దృష్ట్యా కృషిచేస్తేనే రాష్ట్రనిర్మాణంవలన సత్ఫలితాలు సమకూరతవి ; తమపైనున్న గురుతర బాధ్యతను ప్రజాప్రతినిధులు నిర్వహించకలుగుతారు. కాబట్టి ప్రజలు, శాసనసభలలోని వారి ప్రతినిధులు విద్యుక్త ధర్మాన్ని నెరవేరుస్తారనే మా నమ్మకం.



# నవ్విన అన్నపూర్ణ

అప్పటికి నాకు పదిహేడేళ్లు వుంటాయి. నా పరాళ్లలాటి పల్లెటూరు బడుల్లో చదువు అంత మంచిది కాదన్న వుద్దేశంతో స్కూలు ఫైనలు చదివించడానికి మా నాన్న నన్ను బెజవాడ పంపాడు. అక్కడ మా మామయ్యకు సొంతయిల్లు వున్నది. నన్ను తీసుకొని మా మేనమామ సరాసరి హెడ్ మాస్టరుగారి గదిలోకి వెళ్లి, ఇంగ్లీషులో అరగంట తర్జనభర్జనలు జరిపాడు. హెడ్ మాస్టరుగారు నా మార్కులలిస్టు చూచి ససేమిరా వీణ్ని మా స్కూల్లో చేర్చుకోనని అన్నారు. అయినా మామామయ్యకు యేవిషయమైనా కొసావరకూ లాగి ప్రయత్నించే అలవాటు వున్న కారణంచేత నన్ను బళ్లోచేర్చుకోక తప్పదనీ, వెనక నేను చదివింది పల్లెటూరి బడి అనీన్నీ, అందులోని మాస్టర్లంతా రోజుకు యిరవైమూడు గంటల ముప్పైమూడు నిమిషాలు డబ్బుసంపాదన తాపత్రయంలోనో, ట్రాన్స్ఫర్ల గొడవల్లోనో కుత్తుకలోతున దిగబడివుంటారని, తత్కారణంచేత మార్కులు తక్కువరావడం సహజమనీ, కనుక నన్ను బళ్లో చేర్చుకోక పంపెయ్యడానికి అది అంత పెద్దకారణం కాదనీ వాదించి, చిరాకుకొమ్మన మిఠాయిపొట్లంలా కూచున్న హెడ్మాస్టారిని ఒప్పించేటప్పటికి బ్రహ్మరుద్రుణ్ని దింపినట్లయింది. హెడ్మాస్టారు నావంక తిరిగి గోటు సిక్స్తుఫారం, 'ఏ' అని అన్నారు. ఆ వయస్సును బట్టే మా హెడ్మాస్టారి మాటల్లో యింద్రపదవి ఏదో నాముందుదొర్లినట్లయింది. వెనుక వచ్చిన బ్లాకు మార్కుల్ని యీ దెబ్బతో తుడిచేసుకొని, "పాపం, వీడు బాగానే చదువుతాడు. నేనే వృథాగా అనుమానించానని హెడ్ మాస్టారు అనుకోవాలి" అని ఆలోచించుకొంటూ తలవంచుకు నడుస్తూన్న నేను ఎదురుగావస్తూన్న ఆవాలుకళ్లమ్మాయిని చూడనేలేదు...జరగవలసినపని కాస్తా జరిగిపోయింది. ఆ పిల్ల పుస్తకాలన్నీ చెల్లాచెదురుగా వరండా. అంతా విరజిమ్మినట్లు పడిపోయాయి. కంపాసు బాక్సులోని పరికరాలు హెడ్ మాస్టరుగారి గదిముందుపడి, ఘొల్లుమని ఆ నారీ రత్నానికి జరిగిన అవమానాన్ని తెగేసి చెప్పినాయి.

ఇట్టివి యింతకు పూర్వము ఎప్పుడూ నా అనుభవంలోకి రాలేదు. ఏం చేయాలో తోచక బిక్కమొహంవేసి బెరుగ్గాముందుకు చూశాను. అప్పటికే ఆ పిల్ల పుస్తకాలనీ కంపాసు బాక్సునీ ఏరుకొని అసలు ఏమీ జరగనట్లుగా నాకేసి కొంటెగా నవ్వుతో వెళ్లిపోతోంది. బంట్రోతు ఒకడు కొరగాచూస్తూ, పెదవుల్లోపల యికిలిస్తూ, బుజాన్ని రాసుకొని అటుపోయాడు. గుండెఝల్లుమంది. హెడ్మాస్టారు పిలుస్తారేమోనని పదినిముషాలు చూసి, ముప్పైమూడు గదులుకల ఆ విశాలభవనంలో నేను ఒక సంవత్సరమంతా గడపవలసిన గది వెతుక్కొంటూ పోయాను.

పదినిమిషాలు తిరగంగా సిక్స్తు ఫారం 'ఏ' కనిపించింది. వెండికట్టువేసిన సులోచనాల్లోంచి, అప్పుడప్పుడు జరిగే సాదావిప్లవాల్ని కడకంట నివారిస్తూ, టేబులుకు ప్రక్కగా బ్లాకుబోర్డుకేసి తిరిగి, కుడిచేతిలోని చూపుడు కఱ్ఱతో బ్లాకుబోర్డుకు వేలాడ తీసిన అంచులు శుష్కించిన ఐరోపా ఖండపు మ్యాపు చూపిస్తూ, యింటి దగ్గిర చదువుకొచ్చిన ఖండాంతర పరిస్థితుల్ని అనర్గళంగా వర్స చెప్పుతూన్న జాగ్రఫీ మేష్టార్ని చూసి, లోపలికి అడుగుపెట్టడానికి గుండె చాలక తలుపు ప్రక్కకొదిగి నిలబడ్డ నేను, నావంక కొంటెగా నవ్వుతో, ముక్కు ఎగరేస్తున్న వాలు కళ్లమ్మాయిని చూశాను. ఒక్కసారిగా ముచ్చెమటలు పోశాయి. ఒక్కటొక్కటే క్లాసులోని అందరి దృష్టులూ, నామీదపడి, నానుంచి భూగోళం మేష్టారి కళ్లద్దాలమీదపడి, వాలుకళ్లమ్మాయిమీద కొంతసేపునిలిచి అక్కడనుంచి క్లాసంతా కలగా పుల

గంగా ప్రతిఫలించసాగాయి. ఇట్టివిషయాలను కనిపెట్టడంలో కాకలు దీరిన మేష్టారు నాకేసితిరిగి, "ఎవరోయి, ధీమంతుడా? గదిబయట తాచ్చారం, చేస్తున్నా"వని పలుకరించారు. పిల్లలు నవ్వులోకి వుపక్రమించారు. వాలు కళ్లమ్మాయి పుస్తకంలో మొగం దాచుకొని పగలబడి నవ్వుతోంది. ఎల్లాగైతేనేం, తెప్పరించుకొని "నేనాండీ, క్రొత్తవాణ్ణండి" అని అన్నాను. ఆ అనడంలో గ్రహబలం చాలక నోరు జారి కొత్తవాణ్ణి అనడానికి బదులు కోతివాణ్ణి అని వచ్చింది. మేష్టారూ పిల్లలూ అందరూ ఒక్కసారి నవ్వేరు. ఆ నవ్వుల్లోనే క్లాసులోకి రమ్మనమని మేష్టారు అనుజ్ఞయిచ్చారు. నవ్వులు అయిదు నిమిషాలదాకా చల్లారలేదు. వాలు కళ్లమ్మాయి మరీను. పుస్తకంలో మొహందాచుకునిబుగ్గలు యెఱ్ఱపడేటట్లు ఒకటే నవ్వు.

ఆ రోజంతా అట్లానే గడిచిపోయింది. "తన వెంటన్ సిరి, లచ్చి వెంటనవరోధ వ్రాతమన్నట్లు" ఆ కొంటెపిల్ల కళ్లతో బుగ్గలతో నవ్వడం, ఆమె స్నేహితురాండ్రు పెదవులు కదిలించటం, సోదర విద్యార్థులు పకాలున నవ్వడం, ఇంతలో యేమూలనుంచో కోతివాడు అని యెవడో కీచుగొంతుతో రాగాలాపన చేయడం, నేనుపళ్లు బిగబట్టి తలవంచుకోడంతో ఆ రోజు ఒకయుగంలాగడిచింది. నా మనస్సులోక్షోభ ఎవరితో చెప్పకోవాలి. అంతా కొత్తవాళ్లు. వాళ్లకి నేను కోతివాణ్ణి. అప్పుడే ప్రొద్దున్న జరిగిన పని తారాజువ్వలా కుఱ్ఱాళ్ల బుఱ్ఱల్లోకి పాకిపోయిందేమో, ఆ పిల్లనూ నన్ను రెట్టించి చూడ్డం మొదలెట్టారు. లాంగుబెల్లు కొట్టారు. ఎవళ్ల దారిన వాళ్లు పోతున్నారు. నేను ఒక్కణ్ణి తలవంచుకుని పుస్తకాల సంచీ బుజాన్నతగిలించుకొని, ఎన్ని ప్రమాదాలొచ్చినా, విడవకుండా నన్ను సేవిస్తున్న మా కీలుగుఱ్ఱంసైకిల్ని సమీపించేటప్పటికి నా మనస్సును అంగుళంన్నర లోతున కోసేసిన సంఘటన ఒకటి చూడవలసి వచ్చింది. ముందుచక్రం టైరు మూడు అంగుళాల పొడుగున కోయబడింది. మనస్సు క్రోధంతో వుడికిపోయింది.

తనకంటె రెండేళ్లు చిన్నదిగా కనిపించే చిన్నదాన్ని ఒకతెను తనవెంట తీసుకెడుతూ, ఏటిగాలికి మొగలి రేకులు శబ్దంచేసికొన్నట్లు, "చూశావుటే కోతిగార్ని" అని ఆవాలు కళ్లమ్మాయి అంది. ఇంకవుండబట్టలేకపోయాను. నిక్షేపంగా స్కూల్లో చేరుదామని వచ్చిన నేను, కాస్తమంచి స్వభావంకలవాణ్ణి కాబట్టి, వరండాలో తలవంచుకు పోతూంటే, ఎదురుగా నడుస్తూన్న ఆపిల్ల నన్నుగుద్దుకొని తెగనవ్వబట్టేకదా యీ పిల్లలికి ఇంత లోకువ అయ్యాను. అల్లానవ్వడమెందుకు? పెద్దతెలివైనదానిలా ఆ కళ్లతోటే బుగ్గలతోటే కనీకనిపించకుండా అంత,సుతారంగా నవ్వవలసిన అవసరమేమిటి?

"ఏయ్, పిల్లా యేమిట్లా నవ్వుతావు? "

"ఎవరు నవ్వారమ్మా"

"నువ్వే"

"ఎవరికేసి ? "

"నాకేసే"

"నిన్ను చూసి నేనెందుకు నవ్వుతాను. "

"ఎందుకు నవ్వుతావో, ఇకముందు అల్లాంటి పన్లు చేయి, తెలుస్తుంది. మూర్తి అంటే యెరగవులే" అంతవరకూ నవ్వుతూన్న వాలు కళ్లపిల్ల విశాల నేత్రాలు ఎఱ్ఱబడ్డాయి. బుగ్గలు లేతమందారాలుపూచాయి. పెదవులు శీతగాలికి చలించే తామర మొగ్గలయాయి. ఆ విశాలనేత్రాల్లోంచి ముత్యాల్లా కన్నీళ్లు, బొట్టు బొట్టుగా శరత్కౌముదీ సుందరమైన, తత్కపోలాలమీదా మెరసిపోతున్నాయి. ఆ విశాల భవనంలో, ఆమె, నేనూ, ఆ పిల్లతోవున్న ఆ రెండో అమ్మాయి తప్ప అందరూ వెళ్లిపోయారు. అంత కోపమూ ఎక్కడికిపోయిందో, మనస్సంతా జాలితో నిండిపోయింది. ఎన్నో ఓదార్పుమాటలన్నాను. ఎన్ని విధాలుగానో బ్రతిమాలుకొన్నాను. ఇంకా యేడుస్తూనేవుంది.

"ఊరుకోవూ ? "

"ఏం వూరుకోంటుంది. అన్నిమాటలంటే ఎవరు మాత్రం ఏడవకుండా వుంటారు." సీమపచ్చిమిరప కాయలా అందుకొన్నది రెండోచిన్నది.

"అదికాదులే, అమ్మాయి; ఏదోమీకంటే పెద్ద వాణ్నికాదూ! కొంచెం కోపమొచ్చింది కనుక అల్లాగ అన్నాను. ఎప్పుడూ కోప్పడతానా? మూర్తి అంటే చాలా జాలి గుండె కలవాడని మా వూర్లో ఎవర్ని అడిగినా చెప్పుతారు. నీవు వూరుకోకపోతే, నాకూ ఏడుపొస్తుంది. పోనీ; నేను ఏడవనా?"

......ను నవ్వువచ్చింది. వానవెలిశాక వచ్చే చంద్రకిరణాలకంటె లక్షరెట్లు గొప్పదిగా కనిపించింది ఆ చిరునవ్వు. ఒకసారి ఆ కళ్లను తుడవాలని పించింది. పరస్త్రీని, ప్రేమహృదయంతో, ఒంటరిగా స్పృశించడం అదేమొదటిసారి. ఆమె ఒడలంతా ఒక్కసారి పులకించిందేమొ!........

"బావా, యింకెప్పుడూ కోప్పడవుకాదూ?"

"బావా, బావ ఎవరు?"

"ఇంకెవరయ్యా, నువ్వే వున్నవాడివి. మేమెందుకు గుర్తుండాలి" పక్కుమంది రెండోది.

"కాదులే బావా, మామయ్యను మా నాన్నపిన తండ్రి కొడుకు. ఇదివరకే మానాన్నతో మామయ్య చెప్పాడు, నిన్నుబస్తికి తీసుకొస్తానని. ఇవాళ మామయ్యవెంటనున్న నిన్ను పోల్చుకొన్నాను. అయనే పరిచయంచేసేవాడు. కాని పనితొందరమీద వెళ్లిపోయాడు. వరండాలో ఆ పని జరిగాక మాబావగారి బుద్ధికుశలతకు నవ్వువచ్చింది. ఇది మా చెల్లి" ఎవళ్లదారిన వాళ్లు వెళ్లిపోయాము. నా హృదయం ఎల్లావుంటుందో రసజ్ఞులకే తెలియాలి.

ఇంతవరకూ వ్రాశాక యికయేమివ్రాయాలో తోచటంలేదు. పళ్లసందున కలం మొనయిరికించి ఆలోచిస్తున్నాను. ఎప్పుడొచ్చిందో మా యింటావిడ వెనక నిలబడివుంది.

"ఎప్పుడనంగా తెచ్చానండీ, కాఫీ చప్పగా చల్లారిపోతోంది. అయినా ఏళ్లుపైబడ్డకొద్దీ యిదేం రాతలండీ?"

అన్నపూర్ణ చూడనే చూశింది.

"తప్పేముంది, జ్ఞాపకమొచ్చింది గనుక వ్రాశాను, జరగని సంగతా?"

"వూరుకోండి, ఇటువంటి విషయాలు వూళ్లో వాళ్లకి చెప్పుకొంటారుటండీ"..........

ఇప్పటికి ఆరేళ్లబట్టీ ఆమె నాతో కాపురం చేస్తోంది. ఇద్దరు పిల్లల తల్లిఅయింది. ఆవాలుకళ్లల్లోని వెనకటి చిలిపితనాన్ని మాతృభావనలు ముంచివేశాయి. నా జీవితాకాశంలోని ప్రత్యణువునూ స్పృశించి పులకింపచేస్తున్న తదీయ చాంద్రమసీదృక్కులలో నాఅధైర్యాన్ని దాచుకోలేను. కిటికీలోంచి బయటకు చూశాను.

---

శ్రీ కే. యన్. కేసరి గారికి.

మానసీయా! వందనములు

తాము పంపిన గృహలక్ష్మి జయంత్యుత్సవాహ్వానమును అత్యానందభరితుడనై వందన పూర్వకముగా నందికొంటిని.

కేసరీ! నరకేసరీ!! తమకేసరి—

స్త్రీజనోద్ధరణమునకై గృహలక్ష్మి స్వర్ణ కంకణ
ప్రదాతలై గృహలక్ష్ములనేటేట ప్రోత్సహించుట,

ఊటలూరే కవితా మాధురీ ఝరీ నోలలాడించే "శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ"గారి వత్సరమున స్వర్ణకంకణ గృహీతలగుట మిక్కిలి ప్రశంసనీయము.

సేవకుడు, పోలాకి శ్రీనివాసరావు.
"తెలుగు బోధిని గ్రంథకర్త" బూరవల్లి

వ్యంగ్యం:

 విద్యావతి విజ్ఞప్తి 

హా; మైడియర్ రామస్వామీ!
టేబిల్, డస్కు, ఎక్కడ?
బీరో. కార్పెట్, కర్టనేది?
పిల్లో, క్రేడిల్, రౌంటేబిల్?
బెడ్‌రూమ్, కుక్‌రూమ్, బాతింగ్‌రూమ్
డ్రెస్సింగ్‌రూమ్ డైనింగ్‌రూమ్
స్టోర్‌రూమ్ విడి విడిగ వుండకపోతే
సంసారానికి ఫౌండేషన్ నాస్తేనయ్యా

నీ ఫేవర్, హానర్ నాకొద్దు
రెస్పెక్ట్ ఇయ్యాలయ్యానాకు
ఆక్టివిటిలేదే నీలోచూస్తే?
డెబిలిటి పూర్తిగ వున్నట్లుందే?

అమ్మయ్యో: ఈవంటనాచాత కాదు
మార్టర్, కట్టర్, పెసిల్ బాబో!
బ్రూమ్, ఓవన్, లాడిల్ అయ్యో;
బాస్కెట్, బేల్ని తాకనయ్యా:

గ్లాస్ వెస్సల్, సిల్వర్ వేర్
చైనావేర్ కావలయ్యా
ఫిల్టర్ పాట్స్, హాచట్, హామర్
సిజర్స్, టాంగ్స్‌నాకెందుకయ్యా?

గార్లిక్ తినను, పికిల్ తాకను
మెయిజ్, మిల్లెట్ అసలేముట్టను
బిస్కెట్, కేక్, టాస్ట్, కేపన్
ఫిష్, మఫిన్, కాఫీ- టీ కావాలి!

లేడీఫింగర్, సాంబర్ బీన్, రాడిష్
హార్స్, రాడిష్‌రోసల్లీ,స్వీట్‌పొటాటో
బ్రింజాల్స్, స్నేక్‌గోర్డ్, బిట్టర్‌గోర్డ్
అదీ, ఇదీతెస్తే, చస్తే వండను

రెంటు కొంపలో కుంటిపిల్లలా
కూర్చోనండి. కుమిలి చావనండి
రేజ్, రిస్కులుగ నీకుమయ్యా!
'నాలైఫ్, లక్, లైస్ నాదేనయ్యా!

సండే మండే కుదివంట.
ట్యూస్‌డే, వెడ్‌నస్‌డే అత్తయ్యది తంట
తర్స్‌డే, ఫ్రైడే మామయ్యది అంట.
కాకపోతే సాటర్‌డే మాత్రం నాది వంట!

ఏదో ఒకటి కానీయండి అగ్రిమెంట్
ఇందుపై ఏమేనా వుందా స్టేటుమెంట్
పారతోలాలికులోని సస్పెషన్
ఇదే నా ప్రేమపూర్వకమైన కాషన్!

మిస్. నిరుపమగురుకుల్

---

# స్వామినాథన్

మూలం :
శ్రీ ఆర్. కె. నారాయణ్

స్వేచ్ఛానువాదం :
శ్రీ చీమలపాటి సూర్యనారాయణ

(గతసంచిక తరువాయి)

[స్వామినాథన్‌కు మణి, శంకర్, శామ్యూల్ ముగ్గురు స్నేహితులు, వీళ్లందరిలోకి మణి చాల పోకిరి. చదువు సంధ్యలు లేకుండా అల్లరిగా తిరుగుతూ ప్రతివాళ్లతోటి గిల్లి కయ్యము పెట్టుకొనేవాడు. అందువలన ప్రతివారికి అతనంటే భయం. రాజం అనే బాలుడు మద్రాసునుండి నూతనంగా వచ్చిచేరాడు. ప్రతిరోజు చక్కగా ముస్తాబై స్కూలుకు వెళ్లుతుండేవారు. అతనిపై తన డాబా చూపించాలని మణి రాజంను కదిలించాడుకాని వ్యవహారం ఎదురెక్కింది. అందుకని ఎలాగైనా రాజం తలను తన కర్రతో బద్దలుచేసి నదిలో గిరాటువేయాలని ఊహించి కయ్యానికి కాలుదువ్వాడు. ఈ కథాకాండ అంతా స్వామినాథన్ సహకారంతోనే జరుగుతోంది — ఇక చదువండి.]

దూరాన — బూట్ల 'గరగర' శబ్దం స్వామి మనో భావములన్నింటిని చెదర గొట్టింది. రాజంవస్తున్నట్లు స్వామి చూడగానే, స్వామి గుండె లెందు చేతనో తీవ్రతమంగా కొట్టుకుంటున్నాయ్.

రాజం కాకీ దుస్తులను ధరించి, చంకలో తుపాకీతో వారి ముందు ఠీవిగా నిలబడి. —

"నేను సిద్ధంగానే యున్నాను !" అన్నాడు.

"నువ్వు ఆలస్యంగా వచ్చావ్ ?"

"అవును"

"మనం మొదలు పెడదాం (యుద్ధం)"

రాజం తన చంకలోవున్న తుపాకినితీసి గాలిలోకి ఓ గుండు వొదిలాడు. మణి ఆధ్వనికి అదరి పోయాడు. చంకలోని గద క్రిందకు జారిపోయింది!

"విన్నావు కదూ ? నువింకా జడమునకు పూనుకొన్నట్లయితే, యిక - యీ తుపాకీగారు వేయుచున్న 'లాటరీ' లో నీకో బహుమతి వస్తుంది; జాగ్రత్త హెచ్చరిక సాహో !" రాజం ఒక్కమారు వురిమాడు !

"ఇది చాలా అన్యాయం; నీకు తుపాకీవుంది నాకు లేదు. కాబట్టి — ముష్టియుద్ధం (Hand - to - Hand fight) చేయటం మంచి పద్ధతి!" అన్నాడు మణి.

"అయితే నువ్వెందుకా కర్రగద తెచ్చావ్? నిన్న ఏ ఆయుధం తేనని చెప్పేవే"

మణి క్రిందకు బుర్ర వంచాడు.

"నిన్నెదుర్కొనేందుకు నన్నేంచేయమంటావ్ ?"
రాజం ప్రశ్నించాడు.

"నన్ను మారుపేరుతో ఒకరి దగ్గరపిలిచి న్యూనత పరిచావ్ !" మణి తన ఆక్షేపణ తెలుపుదుంజేశాడు!

"అది పదహారణాల పచ్చి అబద్ధం" వారిరువురి మధ్యా మౌనం కొంతకాలంవరకు ద్రొల్లింది."

"అదే — నీకోపాన్కి కారణమైనట్లయితే — అంతా మరచిపో. నేనుకూడా మర్చిపోయి, యిఁక నుండి మనమందరం స్నేహితులుగా వుందాం!" రాజం వుత్సాహంగా ప్రకటించాఁడు.

పరిస్థితినంతా స్వామి యర్థం చేసుఁకుని, విస్తుఁబోయాఁడు. ఇంతవేగంలో — రాజంకు, మణికి పొత్తుకుదురుతుందంటే - స్వామి నమ్మలేకపోయాడు. స్వామి వురికి పొంగే సంతోషముతో వారిమధ్య నృత్యం చేయసాగాఁడు, ఎవరి ఆయుధాలు వారు క్రిందను పడేసారు. రాజం తన జేబునుండి బిస్కత్తుల ప్యాకట్టునుఁదీసి, అందరికి పంచి పెట్టాఁడు.

నదీవుత్తుంగ తరంగములకు రావిచెట్టు కఠినీకృత శాఖలు ఢీకొని చెవులకింపైన నాదమును సృష్టిస్తూంది. దూరాన - సూర్యుడ స్తమిస్తున్నాడు. కనులకింపైన స్నిగ్ధమయిన ఎరుపు ప్రపంచం నలుమూలలా అలుము కుంది.

✂

స్వామి నివశిస్తూన్న గదికోమూలలో స్వామి నాయనమ్మ నివశిస్తూన్న గదుంది. స్వామి భోజనం చేసి, నాయనమ్మ తొడమీద తలఁబెట్టుగుని పడు కున్నాడు.

"నాయనమ్మా, నీకు తెలీదుగాని, 'రాజం' ఎటు వంటివాడనుకున్నావ్?" అంటూ-రాజంకు, మణికి యెలాగ జగడం ప్రారంభమైందో, వారుభయులూ వొకర్నొకరు యెలా నరుక్కోనేందుకు ప్రయత్నించారో, తరువాత—వారిరువురూ ఎలా స్నేహితులుగా మారిందీ మున్నగు విషయాలు పూస గ్రుచ్చినట్లు వివరించి చెప్పాడు!

"వాడెప్పుడూ పోలీసు దుస్తులనే ధరిస్తూ వుంటాడు, నీకు తెలుసా?"

"నిజంగా? ఎందుకని పోలీసు దుస్తులను ధరిస్తూ వుంటాడు?" నాయనమ్మ ప్రశ్నించింది.

"వాళ్ళనాన్న పోలీసు సూపరింటెండెంట్! యిచటనుండే ప్రతీపోలీసుమీదా అధికారి, తెలుసా?" అన్నాడు.

స్వామి నాయనమ్మ తృప్తి చెందింది. తన భర్త మేజిస్ట్రేటుగా పనిచేస్తున్న రోజులలో పోలీసుల మీద అతనికెంత అధికారమున్నదీ వివరించి చెప్ప సాగింది. స్వామి — యెప్పటికైనా యీ అనవసరపు సొదనంతా చెప్పటం విరమించుకుంటుందేమో అని మహాఓపిక వహించాడు. కానీ — ఆమె - తడబడుతూ, అనేక సంఘటనలను కలిపివేస్తూ, ఎవరికి బోధపడకుండా చెబుతూంది.

"ఇఁక చాలమ్మమ్మా! నన్ను రాజం గురించి కొంచెం చెప్పనియ్! లెఖల్లో రాజంకు ఎన్ని మార్కులు వచ్చాయో నీకుఁ దెలుసా?-"

"అన్ని మార్కులు వచ్చియుండాలి; అవునా అబ్బాయ్?" నాయనమ్మ ప్రశ్నించింది.

"కాదు; నూటికి తొంభై మార్కులు తెచ్చగున్నాడు—",

"మంచిది. నువ్వుఁగూడా అన్ని మార్కులూ తెచ్చుఁగునేందుకు ప్రయత్నించు! ... నీకు తెలీదుఁగాని స్వామి, మీతాత లెఖల్లో యెంత మేధావి అనుకున్నావ్? మీతాతచేసిన లెఖలు యద్భుతంగా వుండటంచేత, అధికారులు మెచ్చుఁగుని, ఓమారు రెండు వందలు మార్కులిచ్చారు తెలుసా? మీ తాతకు ఎఫ్. ఎ. ప్యాసైన తరువాత పెద్ద బంగారు మెడలు ఇచ్చారు ... అది నావద్ద ఎంతకాలం వరకువుంది చెప్మా? ... మీ అత్త పుట్టిన తరువాతవరకు ... అఁహుఁ ... మీయత్త పుట్టిన తరువాతవరకుకాదు ... మీనాన్న పుట్టిన తరువాత వరకు ... కాదు, కాదు ... ... మీయత్త పుట్టిన తరువాతవరకువుంది."

అంటూ, గాలి పోఁగుఁజేసుఁగుని, ఏవేవో కథలు చెప్పసాగింది. ఇవి వినడాన్కి స్వామికి తల నొప్పిగావుంది. విపరీతమైన - కోపావేశముతో:—

"ఇఁక చాలునమ్మమ్మా! నువ్వేదో గాలి పోఁగు చేసుఁగుని, అనవసరపు చెత్తనంతా చెప్పుగుపోతు న్నావ్! రాజం గురించి నీకు వినాలనిలేదా?"

"చెప్పమ్మా, చెప్పు; వింటా—"

"వాడు చిన్నవాడిగా వున్నప్పుడు ఒక పులిని చంపాడు తెలుసా ?"

"అబ్బా! తెలివైనవాడు కాబోలు !"

"నువ్వు నన్ను తృప్తిపరిచేందుకట్లా అంటున్నావ్. నేను చెప్పేమాటలయందు నీకు విశ్వాసం లేదల్లేవుంది" స్వామి కోపగించుకున్నాడు ...

స్వామి వుత్సాహంగా యీ క్రింది విధంగా చెప్ప సాగాడు :

"రాజం తండ్రొకనాఁడు ఒక అడవిలో కేంపు వేశారు. రాజంకూడా ఇతనితో వెళ్లాడు! ... అనుకోకుండా యెక్కడినుండో ఓ పులివచ్చి రాజం తండ్రిపై తిరుగబడింది. వెంటనే తుప్పల దగ్గరున్న రాజం ఆలస్యం చేయకుండా పులిని కాల్చి చంపేశాడు ... నాయనమ్మా, నిద్రపోతున్నావా ?" కథ చివరిభాగంలో నాయనమ్మను స్వామి ప్రశ్నించాడు.

"నిద్దరపోలేదమ్మా, వింటున్నా."

"అయితేవుండు నిన్ను పరీక్షిస్తా. ఎన్ని పులులు రాజంమీద కొచ్చాయో చెప్పు చూద్దాం?–" అని ప్రశ్నించాడు.

"రెండు పులులు–" తణువుకోకుండా సమాధానం చెప్పింది.

పరాకుగ తాను జెప్పిన వొక ముఖ్యమయిన విషయాన్ని విననందుకు వాస్తవికంగా నాయనమ్మమీద స్వామికి పీకమొయ్యా కోపం వచ్చింది.

"నీకు నేనొక ముఖ్య విషయం గురించి చెప్తూంటే, నువ్వు వినకుండా – నువ్వేదో యనవసరపు చెత్తనంతా ఆలోచిస్తూఁ కూర్చున్నావా ? యీఁకనుండి నీకేదీ చెప్పఁదల్చుఁగోలేదు. నువ్వింత పరాకుగా వుండేందుకు కారణం యేమిటో నాకు దెల్సు ... నువ్వు రాజంను న్యూనత పరుస్తున్నావ్."

అంటూ, స్వామి బుంగలా మూతిపెట్టాడు. తాను శ్రద్ధగా వింటూన్నానని, రాజంను న్యూనత పరచలేదని నాయనమ్మ చెప్పిన మీఁదట, స్వామి కొంత సేపటికి తృప్తిచెందాఁడు !

ఆతక్షణమే స్వామికింకో సందేహం కలిగింది :

"నాయనమ్మా, నువ్వీ పులుల సంఘటను నమ్ముతావంటావా?–"

"ఎందుకు నమ్మను నాయనా ? ప్రతీ యక్షరం నమ్ముతా ? –" అంది.

## ౬

అది శనివారం మధ్యాహ్నం.–

శనివారమునాఁడు, ఆదివారమునాఁడు, యింటి దగ్గర – నాయనమ్మతోనో, లేక – అమ్మతోనో హస్కుగొట్టటంగాని - లేదా, లెఖలు చెయ్యటంగాని, స్వామికిష్టంలేనిపని ! కానీ – సెలవు రోజులలో మధ్యాహ్నపు వేళలందు ఎండలో తిరగకుండా, యింటి పట్టునుండి, స్కూలుకు సంబధించిన వర్కు చేయాలని తండ్రి కఠినంగా వుత్తరువు జారీ చేయటంవలన, స్వామి అనివార్యంగా సెలవురోజుల్లో యింటిదగ్గరుండిపోవల్సి వస్తూంది !

స్వామి యింగ్లీషు పాఠములను చదువుతున్నాడేగాని, మనస్సు పరిపరి విధాల పోతూంది. స్వామి తండ్రి అతని గదిలోని అద్దం ముందర నిలుఁబడి తల పాగా చుట్టుకుంటున్నారు. తరువాత – సిల్కు కోటు ధరించారు. ఇంక మిగిలిందల్లా-కళ్లకు జోఁడు తగిలించటమే తరువాయి ! కళ్లజోడు తగిలించినప్పటికీ, వాచీని చేతికి కట్టుకోవటం మిగిలిపోయింది.

స్వామి కిప్పుడుత్సాహం సముద్రంమల్లెపొంగి పొరలుతూంది. ఇఁక తన తండ్రి కోర్టుకు వెళ్లిపోతారు. అప్పటినుంచి, మరల తన తండ్రి యింటికి వచ్చేవరకు తనకెంత స్వేచ్ఛ ? ఇంతలో – తల్లి – ఒకచేత్తో మంచినీళ్ళ చెంబును, మరియొకచేత్తో తమలపాకులను పట్టుకు ప్రవేశించింది. స్వామి తండ్రి మంచి నీరు త్రాగేసి, తమలపాకులను వేసుఁగున్నారు. ఇటువంటి మహత్తరమయిన సమయమును కనిపెట్టిన స్వామి యెలుగెత్తి, గట్టిగా యింగ్లీషు పద్యాలను చదువసాగాడు.

స్వామి తండ్రి పొడుంచిరానా డబ్బీనుండిఁదీసి, కపాళం మండేటట్లుపీల్చి, ఆ యింటిలో అలుకుగుడ్డ

కంటే కనాకష్టంగావున్న జేబు రుమాలుతో ముక్కొకతూరి పరిశుభ్రపర్చుఁగొని, యిల్లుదాఁటి, వాకిట్లో నిలుబడ్డారు. వాకిట్లో నిలుబడిన భర్త నుద్దేశించి, స్వామితల్లి:—

"నాకు కొంత చిల్లర డబ్బులుంటే యిప్పించండి; యివాళ — బట్టలు కుట్టిన దర్జీవాఁడొస్తాఁడు. పాపం, నాలుగుదినములనుండి మజూరీ యిప్పించమని ప్రాధేయ పడుతున్నాడు! -" అంది.

"రేపు రమ్మని చెఁబుదూ?" అన్నారు. యివాళ యివ్వకపోతే మర్యాదగా వుండదని, యివ్వక తప్పదని, ఆమె యడగటంచేత, అతనికి అనివార్యముగా పెట్టి తెరచి డబ్బులివ్వక దప్పింది గాఁదు! మరల యద్దం ముందర తలపాగ నొక మారు సవరించుఁకొని, కోర్టుకు పోయారు!

వెంటనే స్వామి పుస్తకాలు మూసివేశాడు. స్వామితల్లి — వంటయింటిలో మధ్యాహ్నపు కాఫీ తయారు గురించి వంట పుట్టితో చెఁబుతూంది, స్వామి నాయనమ్మ తన మంచంపైఁ కూర్చుంది. స్వామిని చూచీ చూడ్డంతోనే:—

"నానీ, యిలారామ్మా!" అని పిల్చింది.

"రాను; నాకు వ్యవధిలేఁదు!"

"నాతంౘ్రడివిఁగావ్, కాణీ యిస్తానురా! -" అంది.

ఈ యాహ్వానమును మాత్రము స్వామి త్రోసి పుచ్చలేక పోయాఁడు!

"ఎక్కడికి వెళ్తున్నావ్ నానీ?" నాయనమ్మ ప్రశ్నించింది.

"నేనల్లక్కడకు పోవాలి!" స్వామినిర్లక్ష్యంగా సమాధానం చెప్పాడు!

"నువ్వు యెండలో తిరిగేందుకు పోతున్నావ్ గఁదూ?—"

"లేదు నాన్నమ్మా!"

"ఎండలో నీయిష్టం వచ్చినట్లు తిరుగు; జ్వరం రాఁగలఁదు!—"

"నేను యెండలో తిరిగేందుకు వెళ్లటం లేఁదు..."

"సెలవు రోజుల్లో యింటిపట్టు నుండమని మీ నాన్న నీకు చెప్పటంలేఁదు."

"చెప్పారనుకో కానీ — మా డ్రాయింగు మాష్టరు తనకోతూరి కల్సుఁగోమని బంట్రోతుద్వారా నాకు కబురు పంపారు. అతను పిలిచిన తరువాతఁగూఁడా నేను వెళ్లకూడదా?...(పెద్ద గొంతుతో) — నేను డ్రాయింగు పరీక్షలో తప్పిపోతే నీకు సంతోషంగా వుంటుంది గాబోలు!" అని అరిచాఁడు!

## 2

స్వామినాధన్ మణి యింటి వీధి తలుపు దగ్గర నిలుఁబడి, చిన్నగా యీల వూదాడు. మణి మాత్రం బయటకురాలేదు. తరువాత—తలుపుమీద గొళ్లెంతో చప్పుడు చేయసాగాడు! తలుపుమెల్లిగా తెరువఁబడింది. తలుపు సందులోంచి మణి బుర్ర బయటకు పెట్టి. —

"అరివెధవా నువ్వా? . మా అత్త యిక్కడేవుంది. అల్లక్కడ నిలఁబడు, యిప్పుఁడే వస్తా! —" అన్నాడు!

స్వామి ముందుకు పురోగమించి, రోడ్డు మీఁద చెట్టొకటుంటే, దాని నీడలో మణిగురించి నిలబడ్డాడు. మార్తాండుడు — నిప్పులను చేటలతో చెరుగుతున్నాఁడు. ఆ వీధంతా యెడారిమల్లే స్వామికి గోచరిస్తూంది.

ఇంతలో — మణి స్వామిని కల్సుఁగున్నాడు. ఉభయులూ రాజం యింటివైపు బయలుదేరారు. వీరుభయులూ ఆ తీక్షణమైన యెండలో నీరసంగా నడుస్తున్నారు. వీరిద్దర్ని ఆగమని, ఓ పోలీసు వీరి వయిపు వస్తున్నాఁడు. స్వామికి పోలీసును చూడంగానే గుండెలు ఆగినంత పనైంది, శరీరమేవత్తూ వొణుకుతూంది! మణిని పోలీసుతో మాట్లాడమని, తాను మాట్లాడేందుకు చాలా భయమని, మణిని బ్రతిమాలుకోసాగాఁడు. ఎందుకు వచ్చారని పోలీసు ప్రశ్నించిన మీదట.—



(సశేషము)





ఋతు, కాల, భావానుగుణంగా రాగాల సృష్టియే భారతీయ గానకళావైశిష్ట్యం. ప్రతి రాగం ఒకభావాన్ని, ఒకకాలాన్ని స్ఫురింప జేస్తుంది. రాగాలకాలం భావస్ఫురణలకు అనుగుణంగా రూపొందించబడిన చిత్రాలు యుగయుగాలనుంచి ప్రచారంలోవున్నవి. అకాల రాగాలాపన గానమాధుర్యాన్ని నశింపజేస్తుంది.

# కేదార

ఇది కేదార రాగభావమునకు సాంప్రదాయకమైన చిత్రణ. ఎడబాటుచెంది, సన్యాసివలె మారు వేశము ధాల్చిన ఒక ప్రియుని మూర్తీభవింప జేయును ఈ రాగాలాపన. దుఃఖమును, దీనత్వమును, పరితృప్తి చెందని ప్రణయ వాంఛను స్ఫురింప జేయు ఈ రాగమును సాయంత్రపు వేళల పాడునప్పుడు. ఆ సంగీతమునకు చంద్రుని గమనముకూడ కుంటుపడునందురు.

# తేనీరు

రాత్రింబగళ్లలో ఎప్పుడైనా, ఎలాంటి స్థితిలో వున్నా, తేనీరు ఉత్తేజం కలిగిస్తుంది.

సెంట్రల్ "టీ" బోర్డువారివల్ల ప్రచురింపబడినది.

CTB 185

# దాగినసత్యం

శ్రీ నందివాడ శ్రీ కృష్ణ చిన్నంరాజు

"బాబూ గంపెయ్యరా" అంటో తిరుగుతోంది సుబ్బి, బజారులో వస్తువులుకొనే ప్రతి వ్యక్తినీ దీనంగా చూస్తూ. అప్పటి కప్పుడే 12 గంటలవేళ అవుతూంది. ఆ రోజు సంత అవడంచేత బజారంతా జన సమూహంతో కిటకిటలాడుతోంది. పాపం! సుబ్బిలోవున్న అమాయికత్వమే ఆమెకు కూలి దొరక్కపోవటానికి ముఖ్యమైన కారణమంటారు తక్కిన గంప కూలీలు. సుబ్బికి సంవత్సరము దాటని మగశిశు వున్నాడు. ఒక ప్రక్క రోగిష్ఠి భర్తకి సేవ చెయ్యటం, రెండవ ప్రక్క సంసారానికి సరిపడే డబ్బంతా కూలిచేసి సంపాదించటం సుబ్బికి దుర్భరమైన కష్టాలు. ఆ స్థితిలోనే పిల్లాడికి పాలుచాలని అవస్త. కడుపునిండా తినడానికి కూడైనా లేనిస్థితిలో పిల్లాడికి పాలెలా కొనగల్గుతుంది. అయినప్పటికి యెల్లాగో కాలంగడుపుతూన్న సుబ్బి యెటువంటి ఇల్లాలో! ఆ అవస్త తోనే తిరుగుతోంది సుబ్బి బజారులో. చివరికి ఒకాయన "యేయ్ గంపా! ఇల్లారా" అన్నాడు. అంతవరకూ తిరిగితిరిగి నిరాశ హృదయంతో యింటికిపోవట మెల్లాగా అనుకుంటూన్న సుబ్బి గభాల్ని ఆయన వద్దకు పోయింది.

"రెడ్డిపేటకు యేమిమ్మన్నావు" అన్నాడు.

"తమకు తెల్దేటి బాబూ! మామూలే" అంది సుబ్బి అమాయకంగా.

"సరే ఆ బియ్యంమూట గంపలో వెయ్యి" అన్నాడు. మారు మాటాడకుండా బియ్యంమూట గంపలో వేసింది సుబ్బి. ఆయనవెంట బయలుదేరింది. త్రోవలోనున్న మరికొన్ని దుకాణాలవద్ద మరికొన్ని సామాన్లు కొన్న తర్వాత ఆయన సుబ్బితోకూడ రెండు గంటలకు చేరుకున్నాడింటికి.

"గదిచూపిస్తా అందులో పెట్టిరా" అన్నాడు వెంకటశాస్త్రుల్లు.

ఇంట్లో ఆడాళ్ళేమంటారో అని సంకోచిస్తు నిలబడిపోయింది సుబ్బి.

"భయంలేదులే ఇంట్లో యెవరూలేరు" అన్నాడు వెంకటశాస్త్రి.

గదిలో సామాను వెలిపేసి "త్వరగా పంపండి బాబూ యింటికాడ పిల్లాడేడుస్తాడు. ఇయ్యాల పాలేనా పొయ్యలేదు" అంది సుబ్బి.

"నీకు పిల్లలెందరు" అన్నాడు వెంకటశాస్త్రి.

"ఒక్కడే బాబయ్యా! త్వరగా పంపండి బాబూ" అంది.

"కూలిమాటకేంకాని వెధవ కూలి నీఇష్టమొచ్చినంత తీసుకో, కాని...నిన్ను

చూసిన దగ్గిరనుంచి నాకదోలావుంది. యిలా దగ్గిరకురా'' అన్నాడు వెంకట శాస్త్రి.

''అదేమిటి బాబూ తమరు చూస్తే పెద్దోరు. మా లాటోల్లనలాగనొచ్చా.'' అందామె జారిపోతున్న పమిటను సరి చేస్తూ.

''ఆ పెద్దేమిటి చిన్నేమిటి'' అంటూ వచ్చి సుబ్బి చెయ్యి పట్టుకోబొయ్యాడు వెంకటశాస్తుర్లు.

అంతటితో సుబ్బి సహించలేకపోయింది.

''అదేటి బాపనయ్యా, నువ్వుచూత్తే శాత్తుర్లు గోర్లాగున్నావు; మాలాటోల్తో నీకెందుకయ్యా'' అంటూ చేతులోవున్న గంపతో అడ్డగించుకుంది, శాస్త్రిగారు చెయ్యబోయే నీచపు కార్యాన్ని. శాస్త్రి పట్టలేని కామోద్రేకంతో ఆమె రొమ్ముల మీదికి చెయ్యిపోనిచ్చాడు. ఆమె తన శీలానికి భంగం కలుగుతుందేమోనని భయంచేత తన చేతిని విసిరింది. ఆ విస రటంలో ఆమె చేతినున్న రాగికడియం శాస్త్రి ముక్కుకుతగిలి ముక్కంట రక్తం కారటం ప్రారంభించింది. రక్తాన్ని చూడ డంతోనే శాస్త్రికి ప్రాణాలు తల కెక్కాయి. ''చచ్చానర్రోయి'' అని పెద్దకేక పెట్టేడు. ఆ కేక వినడంతోనే యిరుగు పొరుగుల వాళ్లంతా యేమిటి సంగతంటూ వచ్చారు. ''దొంగముండ'' అని శాస్త్రి యింకా యేమో కల్పించి జెప్పకుండానే అంతమందీకలిసి ఆమెను తలోపోటు పొడిచి వీధిలోకి నెట్టేసేరు. పాపం! అంతమందిలోనూ ఒకరేనా నిజ స్థితి తెలుసుకోవడానికి ప్రయత్నించటం లేదు, పాపిష్టిలోకం! యెండ తీవ్రంగా కాస్తోంది. వంటినిండా తగిలిన దెబ్బలు యెండ వేడికి మండుతున్నాయి. ఆ సమ యంలోకూడా ఆ పతివ్రతామతల్లి తన భర్త యింటివద్ద యెలా బాధపడు తున్నాడో అన్న తొందరలో వచ్చేస్తోంది యింటికి పాపం! పిల్లాడెంత చిచ్చుపెట్టేస్తు న్నాడో అని ఆమె మరీ తొంధరగా నడు స్తూంది. పరధ్యాన్నంగా నడుస్తూన్న ఆమె రోడ్డు మధ్యనుంచే వీధి మలుపు తిరుగుతోంది. క్షణకాలంలో ఆమె రెండో ప్రక్కనుంచి వచ్చే కారుక్రింద పడి పోయింది.

''బ్రేకు సడన్‌గానే వేశానుబాబూ ఆమె యేమాత్రం తప్పుకున్నా ప్రమాదము లేకపోను'' అన్నాడు డ్రైవరు తన యజ మానియైన కామేశ్వరరావుగారితో.

''సరేలే జరిగిందేదో జరిగింది. ఆమెకు వెంటనే చికిత్స చేయించాలి.'' తెలివి తప్పిపడిన సుబ్బిని సమీపిస్తూ అన్నాడు కామేశ్వరరావుగారు. కాని ఆయనకళ్లె బడింది సుబ్బికాదు. సుబ్బిశవం. ప్రమాద వశంచేత తన కారుక్రింద సుబ్బిపడి చని

పోయినందుకు చాలా విచారించేడు. సుబ్బి భర్తనీ, పిల్లాడినీ తీసుకరమ్మని కబురంపేడు. నాటితో సుబ్బి భర్తకూ, బిడ్డకూ కష్టాలన్నీ తీరిపోయేయి. సుబ్బిభర్తని, పిల్లాడిని అనాధశరణాలయంలో చేర్పించేరు కామేశ్వరరావుగారు. కాని సుబ్బిమాత్రమే అన్యాయపు చావు చచ్చింది. అయితే చావులో కూడ తనవారికి సేవచేసింది.

—(౦)—

## "సుభాషితాలు"

ధూళిమయమైన ధరణి ఒడిలో శిశువుల్లా దుఃఖాలు, సుఖాలు, ఆశలు, భయాలు, దుర్బలతలూ ఉన్నై. వాటిలో ఎన్నో భ్రాంతులు, ఎన్నో వ్యధలు, ప్రేమలు ఒకదాని కొకటి కలిపి వ్యాపించి ఉన్నై.

"రవీంద్రనాధ్ టాగూరు"

♦ ♦ ♦ ♦

స్త్రీరహస్యం తెలుసుకోవడం ఎవరికీ సాధ్యంకాదు. దూరంనుంచే ఒక్క నమస్కారంచేసి ఊరుకోవడమే ఉపాయము. అదే ఉత్తమోత్తమము.

"చింతా దీక్షితులు"

♦ ♦ ♦ ♦

స్త్రీ, వీధిలో దేవకన్య, చర్చిలో సాధువు, కిటికీ దగ్గర సౌందర్యరాశి, ఇంటిలో నమ్మదగినవ్యక్తి, శయ్యమీద రాక్షసి, అదే ఒకప్పుడు పిశాచి.

"ఫ్రెంచి నవలా కారుడు"

♦ ♦ ♦ ♦

స్త్రీ సహజంగా అంతర్వాసిని. రహస్యంగా తనలో తాను నివసిస్తూంటుంది. హృదయ ప్రతిబింబం దేహశోభయందు ప్రకటితమై ప్రకాశించకపోతే ఎవరూ ఆమెను చూచి అర్థంచేసుకోలేరు.

"రవీంద్రనాధ్ టాగూరు"

♦ ♦ ♦ ♦

దాస్యము, స్వాతంత్ర్యముకూడా శృతిమించినపుడు అవి అరిష్టాన్ని కలుగజేయుటలో ఆశ్చర్య మేమీలేదు. అయినా సమపాళ్లలో ఉంటే ఎంతో మంచిది.

"ప్లాటో"

♦ ♦ ♦ ♦

సత్యం, చీరెసింగారించుకొనే లోపల, అసత్యం భూప్రదక్షిణచేసి వస్తుంది.

"జాన్ ప్లోమస్"

సేకరణ : ఇందు ముఖలింగం.

—(౦)—

# నైతిక పతనం

బీదస్థితిలో మనిషియొక్క మంచితనముగానీ, చెడ్డతనముగానీ తెలుసుకోగలము. ఎంతనీతిగా జీవించిన వాడైనా బీదస్థితిలో అవినీతికి పాల్పడవచ్చును. ఎంతజాలిగల హృదయమైనా ఆసమయంలో రాతి గుండెగా తయారుకావడానికి అవకాశం యున్నది. ఇది లోకసహజం.

వెంకట్రావు మంచి నీతిపరుడు. జాలిగుండె గలవాడు. కానీ ఆర్థిక పరిస్థితులు తారుమారైనందువల్లనూ సంఘము చూపిన చిన్న చూపుకనూ వెంకట్రావు తట్టుకోలేకపోయేడు. దయా దాక్షిణ్యాలు లేని క్రూరరాక్షసుడుగా తయారయ్యేడు.

భార్యయొక్క ప్రోత్సాహముమీదట, పట్నవాసపు మోజుకొద్దీ వెంకట్రావు బస్తీలో కాపురము పెట్టేడు. నిలువ చేసిన డబ్బంతా బస్తీలో హరించిపోయినది. వయోభారంతోటి, సంసారభారంకూడ వెంకట్రావు నెత్తిమీద పడ్డది. పెద్దపిల్ల లలిత అంటే వెంకట్రావుప్రాణం వదిలేవాడు. కాని ఇప్పుడో? లలిత అంటే విసుక్కుంటున్నాడు. లలితను ఇంకా పెళ్లి చేయనందుకు ఇరుగు పొరుగు ఆడే మాటలు వినలేకపోతున్నాడు. శని విరగడైపోతే బాగుండుననిపించింది. లలితకు వరునికోసరం దేశమంతా గాలించేడు. కాని వెంకట్రావుకు కట్నం లేకుండా పెళ్లికొడుకులు దొరకడం మహాకష్టమైపోయింది.

విపరీతంగా ధరలు పెరిగి పోతున్నవి. తిండికిలేక ప్రజ తల్లడిల్లి పోతున్నారు. చాలీ చాలని జీతంలో వెంకట్రావు సంసారం మలమలా మాడిపోతున్నది. ఇంట్లోనున్న వెండి బంగారాలు మార్వాడీ కొట్లో మూల్గుతున్నవి. రోజు రోజుకి వెంకట్రావుకి గండంగా యున్నది. వీటికితోడు వెంకట్రావు ఆఫీసర్ల చీవాట్లకు కూడ తల ఒగ్గవలసి వచ్చేది. ఆఫీసర్ల మీద కోపం ఇంట్లో భార్యను, లలితను తిట్టి కసితీర్చుకొనేవాడు. వెంకట్రావుకు జీవితంమీద విసుగు కలిగింది. భార్యా, బిడ్డలను వదలి ఎక్కడికైన పారిపోదామని తలిచేవాడు. కానీ పారిపోలేక ఉక్కిరి బిక్కిరి అవుతుండేవాడు.

లలితతో వెంకట్రావు పూర్తిగా మాట్లాడడం మానివేసేడు. లలిత వెంకట్రావుకు పరమ శత్రువైపోయినది. లలితకు తాను చేసిన గొప్ప నేరమేమిటో అర్థం కావటం లేదు. ప్రపంచంలో తండ్రులంతా పిల్లలపట్ల, ఇలాగే కఠినంగా ప్రవర్తిస్తారు కాబోలు ననుకొన్నది. ఆ పసి హృదయంలో ఏవో భావాలు రేకెత్తేవి. కానీ అవి తీరని కోరికలని లలిత తెలుసుకొన్నది. అయినా ఊరుకొనలేకపోయినది. ప్రక్కయింటి అమ్మాయి కట్టుకొన్న గులాబీరంగు జార్జిట్ చీర కొనిపెట్టమని తల్లిని వేధించింది. కాని పార్వతి కంటనీరు చూచి లలిత మళ్లీచీరను గురించి ప్రస్తావించలేక పోయినది. ఇంట్లోరోజూ నాన్న అమ్మను ఎందుకు కసురుకుంటున్నాడో ఆలేత హృదయానికి అర్థమయ్యేదికాదు. వెంకట్రావు గొంతుకు వినేటప్పటికి లలిత భయంతో చాటుకు వెళ్ళిపోయేది.

---

ఆనాడు అన్నంలో నంజుకోడానికి కూరలు ఏమిలేవు. వెంకట్రావు రాకముందే లలిత కోసరం పార్వతి వడియాలు వేపి అన్నం పెట్టింది. కాని అకస్మాత్తుగా వెంకట్రావు ఇంట్లో అడుగు పెట్టేడు. తోటి గుమస్తాతో దెబ్బలాడేసి యింట్లోకి వచ్చి రుస రుసలాడుతున్నాడు. వెంకట్రావు లలిత కంచంవైపు రాక్షసుడులా గుడ్లు ఉరిమి చూస్తున్నాడు. లలితచేతిలోని ముద్ద అప్రయత్నంగా జారిక్రిందపడిపోయింది. వెంకట్రావు కోపం పట్టజాలక పోయాడు. కంచంలోనున్న వడియాలు లాక్కొని వీధిలో గిరాటవేసేడు. "కూతుర్ని ఇంట్లో కూర్చోపెట్టి మేపుతున్నావు" అని భార్యను మొఖం వాచేటట్లు చీవాట్లు వేశాడు. లలిత పొంగివచ్చే దుఃఖాని దిగమ్రింగుకొని కంచం వద్దనుండిలేచి వెళ్ళిపోయింది. నాన్నకు తనంటే ఎందుకా పగ? లలితకు ఎంత ఆలోచించినా అర్థం కావటంలేదు. ప్రపంచంలో ఆడపిల్లగా పుట్టడమే గొప్ప అపరాధమేమో! అని భావించినది. పరుపు మీద పడుకొని చాలసేపటి వరకు వెక్కి వెక్కి ఏడ్చింది. తండ్రి ఆఫీసుకు వెళ్ళేక తల్లివచ్చి భోజనం చేయమని బుజ్జగించింది. కానీ లలితకు మళ్లీ భోజనం

చెయ్యడానికి మనస్సు అంగీకరించలేదు. సాయంత్రం దాక అలాగ ఏడుస్తూనే నిద్రపోయింది. దీపాలు పెట్టేవేళకు లలిత శరీరం సల సల కాగిపోతూ జ్వరం తీవ్రంగా వచ్చింది. డాక్టర్ని పిలుచుకొని రమ్మని పార్వతి వేడుకొన్నది. కానీ వెంకట్రావు నిరాకరించేడు. రెండురోజులు జ్వరం కాచి అదే తగ్గుతుందిలే అని అనేసి ఊరుకున్నాడు. కానీ వారం రోజులైనా జ్వరం తగ్గుమొఖంపట్టలేదు. డాక్టర్ని పిలువమని పార్వతి భర్తకాళ్ళమీదపడి వల వలా ఏడ్చింది. కానీ వెంకట్రావు రాతిగుండె కరుగలేదు. ఏవో సాకులు చెప్పి తప్పించుకున్నాడు.

ఆనాడు వెంకట్రావు ఆఫీసునుండి కాళ్ళీడ్చుకుంటూ పార్కులోకి వెళ్ళేడు. మనస్సంతా ఎందుకో కలవరంగా యున్నది. ఇంటివైపుకి వెళ్ళేసరికి వెంకట్రావు భయంతో వణికిపోయ్యేడు. భార్య, పిల్లలూ, తన కాళ్ళకు పెనవేసుకొన్న క్రూర సర్పాలు వలె కనుపించేరు. వెంకట్రావు లలితతో మాట్లాడి సరిగ్గ నెలరోజులయిపోయింది. లలిత అంటే తన కెందుకు అయిష్టత కలిగింది? వెంకట్రావుకు బోధపడలేదు. తాను ఇలా మారిపోవడానికి కారణం ఎవరు? ఏవేవో ఆలోచనలు వెంకట్రావు మెదడులో పరుగెత్తుతున్నవి. ఆకాశమంతా నిర్మలంగా యున్నది. మినుకు మినుకు మంటూ వీధిలో దీపాలు వెలుగుతున్నవి. మసక చీకట్లు నలువైపుల ఆవరించి యున్నది. అకస్మాత్తుగా ఆకాశంనుండి ఒకనక్షత్రం రాలిపోయింది. వెంకట్రావు గుండెల్లో ఎందుకో గతుక్కుమన్నది. గుండెలు వేగంగాకొట్టుకుంటున్నవి. రెండడుగుల్లో యిల్లు చేరుకున్నాడు యిల్లంతా నిశ్శబ్దంగా యున్నది. పార్వతి వంటింట్లో పనిచేసుకుంటున్నది. వెంకట్రావు లలిత మంచం వద్దకు వెళ్ళేడు. లలిత నిశ్చలంగా నిద్రపోతున్నది. 'లలితా' అని వణుకుతున్న గొంతుతో పిల్చేడు. కాని చలనంలేదు. లలిత విశాలనేత్రాలు లోతుకు దిగజారి పోయినవి. చంపలు మీద కన్నీటి చారలు, అస్పష్టంగా కనబడుతున్నవి. లలిత కన్నీటిని వెంకట్రావు యీనాడు అర్థంచేసుకున్నాడు. లలిత యెడల తాను చూపిన క్రౌర్యానికి చింతించాడు. 'లలితా' అని మళ్ళీపిలిచాడు కాని లలిత శాశ్వతంగా యీలోకాన్ని విడిచిపెట్టి పోయింది. తీయని కోర్కెలన్నిటిని చంపుకొని కన్నీటితో వెళ్ళిపోయింది. లలిత మధుర స్వప్నాలన్నీ మంట గలసిపోయినవి. లలితా అని మళ్లీ బిగ్గరగా కేక వేశేడు. ఆకేకవిని వంటింట్లోనుంచి పార్వతి పరిగెత్తుకొచ్చింది. వెంకట్రావు కుప్పలా కూలిపోయేడు. "కర్మం చేసుకొని యీపాపిష్టి కడుపున పుట్టేవు. నీ ఆశలు తీర్చలేక పోయేను లలితా" అని వెంకట్రావు కుళ్ళి కుళ్ళి ఏడ్చేడు. లలితకు పువ్వులంటే ఎంతో యిష్టం. కానీ ఒక్కనాడైనా తాను పువ్వులు కొని యివ్వలేక పోయేడు. స్వయంగా బజారునుండి పూలు తెచ్చి లలిత తలనిండుగా శృంగారించాడు. లలిత గులాబి రంగు జార్జిట్ చీరతో పెళ్ళికూతురువలె తయారయింది. నుదుట కుంకుమ బొట్టు కళకళ లాడుతోంది. వెంకట్రావు పూర్తిగా పిచ్చివాడై పోయాడు. శవం యిల్లు దాటేవఱకు వెంకట్రావు పదేపదే లలిత పాదాలు కళ్ళకద్దుకొన్నాడు.

లలిత మట్టికలసి దినాలు, వారాలు గడిచిపోయింది. కానీ తన నైతిక పతనానికి కారకులెవరో ఇప్పటికీ వెంకట్రావుకి అర్థం కావటంలేదు.

బి. యస్. మణి



# కేసరి విద్యాసంఘపు వార్షిక నివేదిక

## 1952-53



కేసరి విద్యాసంఘ పాలకవర్గము తరఫున సంఘ కార్యకలాపములను గురించి నేను సంతోష పూర్వకంగా నీవార్షిక నివేదికను సమర్పిస్తున్నాను.

2. తే 16-4-52 దిన యీ సంఘపు వ్యవస్థాపకులైన శ్రీ కేసరిగారి జన్మదినోత్సవము ప్రస్తుతము కేంద్ర ప్రభుత్వ మంత్రిగానున్న శ్రీ వి. వి. గిరిగారి అధ్యక్షతన జరిగెను.

3. కేసరి మాధ్యమిక పాఠశాల త్యాగరాయ నగరులో 1952 సం॥ము జూన్ నెలలో ప్రారంభించబడెను. దానితోబాటు యీ సంఘము త్యాగరాయ నగరునందు కేసరిప్రాథమిక పాఠశాలను, మైలాపూరునందు కేసరి ఉన్నత పాఠశాలను నిర్వహించుచున్నది.

### 1. కేసరి హైస్కూలు

A. ప్రస్తుతపు విద్యార్థుల సంఖ్య 881 ; క్రిందటి సంవత్సరం 556 మాత్రమే. అందులో 245 మంది బాలికలు.

B. సిబ్బంది ; క్రిందటి సంవత్సరపు సిబ్బందితోబాటు యీ సంవత్సరము నలుగురు సెకండరీగ్రేడ్ ఉపాధ్యాయులు నియమించబడిరి ; మరియు, ఒక యోగ్యత పొందిన వ్యాయామ క్రీడల అధ్యాపకుడు, వృత్తి విద్యా టీచరుకూడ నియమితులైరి.

C. క్రిందటి సంవత్సరమువలెనే యస్. యస్. యల్. సి. ప్రణాళిక ననుసరించి విద్యాబోధనాక్రమము కొనసాగుచున్నది.

D. యస్. యస్., యల్. సి. పరీక్షలు : 42 మంది విద్యార్థులు పరీక్షకు పంపబడి అందులో 25 మంది ఉత్తీర్ణులైరి. పరీక్షకు పంపబడిన 6 గురు బాలికలలో 5 గురు ఉత్తీర్ణులైరి.

E. తనిఖీ : జిల్లా విద్యా శాఖాధికారి విద్యాలయపు నిర్వహణలో హెడ్మాష్టరుగారు చూపిన ఆసక్తిని, శ్రద్ధయెడల తృప్తిని వెల్లడిస్తూ విద్యాలయపు పరిస్థితి బాగుగా నున్నదనిరి.

F. రీడింగురూము : క్రిందటి సంవత్సరమువలెనే దిన, వార, మాసపత్రికలు తెప్పించబడుచున్నవి.

G. విద్యా విషయములు: ఇంగ్లీషు, తెలుగు, సంస్కృతము, హిందీలలో వక్తృత్వ పోటీలు హైస్కూలు, మిడిల్‌స్కూలు తరగతులకు ప్రత్యేక ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడెను. ప్రత్యేకంగా హైస్కూలునందలి ఉన్నత తరగతుల విద్యార్థులకు వ్యాస రచన, వక్తృత్వ పోటీలు ఏర్పాటుచేయబడెను.

H. ఆలిండియా రేడియోవారి బృందగాన కార్యక్రమంలో మా విద్యాలయం వారు 9 సార్లు పాల్గొన్నారు.

I. విలాస ప్రయాణములు : మహాబలిపురం, రెడ్‌హిల్స్, కీల్‌పాక్ వాటర్ వర్క్స్, విమానాశ్రయము, సెయింటు థామస్‌మౌంటు, ఎనామెల్ వర్క్సులకు ప్రయాణములు ఏర్పాటుచేయబడెను.

J. దృశ్యవిద్య : అప్పుడప్పుడు ఫిలిములు చూపించబడుతున్నవి. హెడ్మాస్టరు, యితర ఉపాధ్యాయులు ఎప్పటి శ్రద్ధాశక్తులు చూపుతూ వచ్చిరి.

## 2. కేసరి మాధ్యమిక పాఠశాల

ఈ విద్యాలయము ది 16-6-52 న I, II ఫారములతో ప్రారంభించబడెను. ప్రస్తుతపు విద్యార్థుల సంఖ్య 47. అందులో 21 మంది బాలికలు. పాలకవర్గం నలుగురు హరిజన బాలికలకు ప్రయాణపు ఖర్చులు యిచ్చుచుండిరి. III ఫారం 1953 జూన్‌నుండి ఏర్పాటు చేయబడును.

విద్యాలయపు ఆదాయముతో లైబ్రెరీకిగాను కొన్న పుస్తకములతోబాటు 310 పుస్తకములను ఉచితముగా శ్రీ వెంకటరామా అండ్ కో., వి. వి. రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్స్, రాజమండ్రి, రాజమండ్రి సరస్వతీ పవర్ ప్రెస్‌వారి తరఫున అద్దేపల్లి నాగేశ్వరరావుగారలు యిచ్చిరి.

విద్యాబోధనాక్రమము : విద్యాబోధన తెలుగులోను, హిందీ మూడవ భాషగా బోధించబడుతున్నది. చరకాతోను, కదుళ్ళతో నూలువడుకుట నేర్పబడుతున్నది. ప్రతివారం ఒక పీరియడ్ నీతిబోధనకని ప్రత్యేకించబడింది.

ఆటలు : బాలబాలికల తల్లిదండ్రుల దగ్గరనుండి వసూలైన రు 120-లతో ఆటలలో పోటీలుపెట్టి విజయముగాంచినవారికి జిల్లా విద్యాశాఖాధికారి తనిఖీ సమయంలో బహుమతులు పంచిపెట్టబడెను.

వాఙ్మయసమితి : విద్యాలయంలో స్థాపించబడి 21 వారసమావేశాలుజరిపి అందులో ముందుగా నిర్ణయించబడిన విషయములను గురించి విద్యార్థులు మాట్లాడుటకు తర్ఫీదు యివ్వబడింది. దసరా సెలవులలో బాలానంద సంఘంవారు ఏర్పాటు చేసిన వ్యాసరచన పోటీలో I ఫారం విద్యార్థికి రెండవ బహుమానం లభ్యమయ్యెను.

విలాసప్రయాణములు : అయనావరంలోని గాజుపరిశ్రమశాలకు పూండిరిజర్వాయరుకు, జంతుప్రదర్శనశాలకు విద్యార్థులు పిలుచుకొనిపోబడిరి.

తనిఖీ : ది 21-3-1953 న జిల్లా విద్యా శాఖాధికారిచే తనిఖీచేయబడి హెడ్మాష్టరుగారైన శ్రీపి. రామారావుగారి నిర్వహణక్రింద పరిపాలన పటిష్టంగా నున్నందుకు తృప్తిని వెల్లడించిరి.

నాటక సమాజం . నాటకరంగంలో అనుభవముగల హెడ్మాష్టరుగారు యీ సమాజం యెడల అత్యంతశ్రద్ధ చూపుచున్నారు. సెప్టెంబరు 1952 లో జరిగిన బాలానందం నాటక పోటీలలో విద్యాలయమునకు మూడు స్పెషల్ బహుమతులు–ఒకటి నాట్యకళకు, ఒకటి సంగీతమునకు, ఒకటి విచిత్రవేష ధారణమునకు లభించెను. దానితోబాటు సంక్రాంతి మహోత్సవము సందర్భము ముగ్గుల పోటీలలో మొదటి బహుమానముకూడ లభించెను.

## III కేసరి ప్రాథమిక పాఠశాల, త్యాగరాయనగరు

కేసరి మాధ్యమిక పాఠశాల ప్రారంభములో కేసరి హైయ్యర్ ఎలిమెంటరీ స్కూలు ప్రాథమిక పాఠశాలగా యీ సంవత్సరము మార్చవలసి వచ్చినది. ఈ మార్పువలన 6-వ స్టాండర్డు తీసివేసినప్పటికి విద్యార్థుల సంఖ్య 136 నుండి 155 కు పెరిగినది. బాలికల సంఖ్య 65 నుండి 73 కు పెరిగి అందులో హరిజనుల సంఖ్య 13 నుండి 16 కు పెరిగినది.

విలాస ప్రయాణములు–: మొదట అద్దముల పరిశ్రమకు, జంతు ప్రదర్శనశాలకు గొంపోవబడిరి. రెండవసారి ప్రభుత్వ పాల పరిశ్రమకు, కోళ్ల పెంపకపు శాలకును, మూడవసారి ఎగ్మూరులో ప్రభుత్వమువారు మ్యూజియంలో ఏర్పాటుచేసిన పిల్లల కళా ప్రదర్శనశాలకు గొంపోవబడిరి.

తనిఖీ ; ఎగ్మూరు రేంజి డిప్యూటి ఇన్స్పెక్ట్రెస్ ఆఫ్ స్కూల్స్, మద్రాసుజిల్లా శాఖాధికారి, హెడ్మిస్ట్రెస్, ఆమె సహచరులను ప్రశంశించిరి. ముఖ్యంగా శ్రీమతి

టి. వీరమ్మ, ఎ. కమలా రత్నంగారలు మొదటి స్టాండర్డు రెండు సెక్షన్ల అభివృద్ధి యడల చూపుచున్న ఆసక్తి పేర్కొనతగినది.

సాధారణ జీతము మూలంగా రాబడి, స్పెషలుఫీసు, ప్రవేశ రుసుము, ప్రభుత్వ గ్రాంటుకలిపి మొత్తము రు 6473-5-0. ఈ సంవత్సము ఖర్చు రు 5876-6-8 యిందు మూలంగా ప్రాథమిక పాఠశాల స్వయం పోషకముగా నున్నదని సూచించుచున్నది.

## సామాన్య విషయాలు

ధర్మములు నేనీసంవత్సరము రు 2766/ల ధర్మములను వసూలు చేయగలిగితిని. శ్రీ తిరుపతి తిరుమల దేవస్థానములవారు రు 5000/లను ప్రాథమిక పాఠశాలలో ప్రార్థనామందిర నిర్మాణమునకు మంజూరు చేశారు. దీనికి వెంకటేశ్వర ప్రార్థన మందిరమని పేరుపెట్టబడును. నేను యింకా రెండు మొత్తములు — రు 4000/- లు, రు 1001/- లు యితరత్రా ప్రార్థనా మందిర నిర్మాణమునకు ధర్మములుగా లభించగలవని ఆశిస్తున్నాను. ప్రభుత్వమువారు మూడు యకరముల భూమిని కేసరి విద్యాలయములు ఆటల స్థలముగా వినియోగించుకొనుటకు అనుమతించినందుకు యీ సంఘము వారు కృతజ్ఞతను తెలుపుచున్నారు.

ఇక రాయపేట, మైలాపూరు, త్యాగరాయనగరు నందలి తెలుగు బాలబాలికలు యీ విద్యాసంఘవ్యవస్థాపకులైన శ్రీ డా. కే. యన్. కేసరిగారి భూరివిరాళములు లేకున్నచో మాతృభాషలో విద్యాసౌకర్యములు లేక ఎంతో యిబ్బంది పడవలసియుండేది. ఈ రోజు శ్రీ కేసరిగారి 79వ జన్మదినం. వారి ఆరోగ్యం బాగాతృప్తికరంగాలేదు. పాలకవర్గంతరపున, యిచ్చట సమావేశమయియున్నవారి తరపున శ్రీ కేసరిగారి జన్మదిన సందర్భమున వారిని హృదయ పూర్వకముగా నభినందిస్తున్నాను. మన మందరము వారికి ఆరోగ్యమును ప్రసాదించవలసినదిగా భగవంతుని ప్రార్థిస్తూ వారింకా అనేక సంవత్సరములు మనకండగా నుండవలెనని కోరుచున్నాను.

"జై హింద్"

బండి శ్రీ హరిరావునాయుడు
సెక్రెటరీ

# నిస్పృహత



ఈ ఖండకావ్య రచయిత శ్రీ దొండపాటి రామమూర్తిగారు. చాలకాలం మద్రాసునందలి పి. యస్. హైస్కూలులో నాంధ్రపండితులుగానుండి ప్రస్తుతం 'మణీస్ ట్యుటోరియల్ కాలేజిలో అధ్యాపకులుగా పనిచేయుచున్నారు. శ్రీ కోరాడరామకృష్ణయ్య బోటివారు యీ కావ్యమును అనేకవిధములుగా ప్రశంసించియున్నారు. సం.)

అడుగుల్ శేషధరాధరాంతిక పథంబందుండి తప్పించి పైఁ
బడియత్యార్భటిఁబారు నిర్ఝరతటిన్ బట్టించుచో, నిట్టియా
నడదారిన్ బదముల్ పెనంగనగు చింతల్ దోఁచు, ధైర్యంబు చా
ప్పడనిక్లిక్కముఖాముఖిన్ నిలుచు గోపాలాశ్రయాగావళుల్ ॥

ఐన, ధైర్యమూను మదియేలయన్న నిర్ఝరము చుట్టుశైలసంచయంబు
తనకుఁదానె తెఱచుకొని, దాఁచఁబడియున్న కనుమనొక్కదానిఁ గట్టుకొనియె ॥

ఆవాసంబగుపింపఁ జాలదెదియే; నైనన్ బ్రయాణించు వా
రా వెంటన్ గనుఁ గొంద్రుదామచట, నేకాంతంబ, కించిన్మహా
గ్రావవ్రాతముతో, శిలా వితతితో, గ్రాసార్థిమేషాళితో,
ద్యోవీథిన్ దలపైఁగమించు ఖగరాడ్వ్యూహంబుతో నుండుటన్ ॥

అదినిజంబుగఁ గేవలైకాంతపదము; ప్రక్కఁజని, నీవుఁగని గుర్తుపట్టనట్టి
యొక్కదృశ్యార్థమే కాకయున్నయెడల – నేనునీలో యసూచనన్బూనకుందు ॥

అలసెలయేటి పార్శ్వమున నశ్మసమూహము, శిల్పిచేతలం
దొలఁగివికీర్ణమైన యదిదోఁచుఁ దదల్పపదాత్మకంబు సం
ధిలు, కథయొండ; పూర్వకరణీయ విలాస విహీనమైన, నా
చలిసెగ కెండనీడకది చాలక పోవదటంచు నెంచెదన్ ॥

ఇతరులచేతఁ గొన్న వరమేయిటఁ జెల్లొనరింతునే, లనన్
బ్రతికియు మానవుల్ తఱచువర్ధిలుకంటెను బెద్దకాలమున్,
స్మృతినిడికొందు నిప్పుడును, జిన్నతనంబున నన్నుఁబ్రేమ సం
భృతమతి లాలనంబు నొనరించినవారలఁ, గీర్తిశేషులన్ ॥

వారుభయుల్ పరుండిరొక పక్కన; కాపురముండిరిచ్చటన్
వారిపుస్సరుల్ చనినఫక్కినిఁ; దత్సమయంబు వచ్చినన్

వారు గలంగరాత్మఁ, గలఁపన్ దనువుల్ స్వకుటుంబ మృత్తికన్॥
గోరితి, నీవు వారిఁబ్రదుకన్ బ్రతుకన్ వలెనంచు నెంతయున్॥

అయిన, నాయన్న, యిపుడు సింహావలోకనమ్ము చేయఁగ, నయ్యెకాలమ్మదెంతో,
యాఱుదశలయ్యె లాభమ్మునజయనింత - యప్పులమునింగె మళ్లినాకై నతఱిని॥

నలువదేండ్లీడు వచ్చునందాకనాకు - నాదికాదయ్యె సగము కన్నను విశేష
మగు సహజమాస్తి, కలిగెదైవానుకూలమేను శ్రమలఁబడఁబడ స్వాధీనమయ్యె॥

కడచినమూఁడువారముల కాలముదాఁక స్వతంత్రసిద్ధి నీ
మసులెసఁగెన్-మఱొక్క యజమాను నొకప్డు సహించుటల్ గనం
బడదు, క్షమించుఁగాక పరమంబగు బ్రహ్మమునన్ను, లోక-! నిన్
జెడఁగఁదలంతునే,-నయిననీచనుటే కనుపట్టు మేలుగన్॥

ఆపెను, సంభాషణమిట గోపుఁడ; నంతరము తమదుకురఁగటి శి
లలన్ జూపుచుఁగించిన్మౌన వ్యాస్మృతి కావల నతండు 'పలికెన్ మఱలన్॥

ఆలోయలోఁ గాననాంచలముననొక్క గొల్లఁడు వసియించుగోపనాముఁ
డాతఁడువృద్ధుఁడు, స్వాంతములావును నవయువదార్ఢ్యంబునలరువాఁడు
బాల్యాదివార్ధక్యపర్యంతమంగసం ఘటన నసామాన్య పటిమవాఁడు;
చుఱుకును, దీవ్రత, పరిమిత వ్యయశక్తి సర్వార్థయోగ్య ప్రజ్ఞయు, గలండు
మఱియునాతఁడు తన గోపకరణమందుఁ-దక్క-సామాన్య నరులనందఱను మీఱు
సంతతోద్యుక్తుఁడగుటను జాగరూక -తాపరిస్ఫూర్తిగొన్న చిత్తముననుంట॥

ఈరీతిగా నాతఁడెల్ల వాయువులయు ఝంఝామరున్నాద జాతములయు
నర్థమెఱిఁగె; దాననందఱుఁదఱచుగా నశ్రద్ధగొన, దక్షిణానిలమ్ము
ధారుణీగర్భోద్గతంబగు సంగీత మలదవ్వులంగల మలలమీఁది
భస్త్రిగాతల శబ్దవైభవంబును బోని దానిని జేయఁగాఁ దాను వినును
ఈపగిది హెచ్చరికతఱి గోపకుండు

(సశేషం)

# చర్మబాధలకన్నిటికీ

# సైబాల్




చర్మవ్యాధులన్నిటిని శీఘ్రంగా నివారణచేసి, విషక్రిమి నాశనియై త్వరితంగా కుదుర్చుటలో "సైబాల్" ప్రసిద్ధికెక్కింది - కురుపులు, గజ్జి, ఎక్జిమా, స్కాబీస్, మొటిమలు, తామర, కాళ్లపగుళ్లు, వ్రణములు మొదలైన వాటిని కుదర్చడములో అద్భుతంగా పనిచేస్తుంది.



బిడ్డల ఆరోగ్యమునకు

ప్రసిద్ధిచెందినది:

# రమణీస్

# బేబిగ్రైప్






తయారీదార్లు:

## ది సౌత్ ఇండియన్ మాన్యుఫాక్చరింగ్ కొ., మధుర.

డిస్ట్రిబ్యూటర్సు:

సీతారామా జనరల్ స్టోర్సు ఏజెంసీస్ - విజయవాడ, శికింద్రాబాద్, బరంపురము (గంజాం), బొంబాయి.

# దీక్ష

శ్రీమతి బి. సుందరీబాయి

(గతసంచిక తరువాయి)

ని:-తమరు విశ్రాంతి తీసుకోదలిచారా ?

అ:-అవును. కాని యిచ్చట మాత్రంకాదు.

ని:-ఎక్కడ గురుదేవా ?

అ:-ప్రశాంతమైన సన్న్యాసాశ్రమంలో.

ని:-(ఉలికిపడి) ఏమన్నారు గురుదేవా? ఇక్కడ మీ ప్రశాంతికి భంగంకలిగిందా? సన్న్యాసాశ్రమంలో విశ్రాంతి తీసుకోదలిచారా! నేను కలగంటున్నానా?

అ:-జాగ్రదావస్థలోనే ఉన్నావు నిగమా! ధర్మప్రబోధంకోసం ఆశ్రమ స్వీకారం చేయ నిశ్చయించుకున్నాను.

ని:-(దీనంగా) నాతో పరిహాసమాడు తున్నారా?

అ: పరిహాసంకాదు. వాగ్దేవిసాక్షిగా చెబుతున్నాను.

ని:-(జాలిగా) నిజమే అయితే, ఆ ప్రయత్నాన్నుండి విరమించమని ప్రార్థిస్తున్నాను. ఈ శిష్యుని ప్రార్థన మన్నించండి.

అ:-(నిశ్చలంగా) లాభంలేదుశర్మా. అంతా నిశ్చయమైపోయింది. యిక, యీ పాఠశాల ఆచార్యత్వాన్ని నువ్వు నిర్వహిస్తావని మాటయివ్వడమే తరువాయి.

ని:-నేనంగీకరించనినాడు ?

అ:-గురుద్రోహివి అవగలవా నిగమశర్మా?

ని:-(ఏడుస్తూ) నన్ను శపించండి. తిరిగి వెనకటి అజ్ఞానుణ్ణిచేసివేయండి. యీనాటి నా విద్వత్తుకు మీరే ఆధారభూతులు. అటువంటప్పుడు మీరు నిత్యమూ కూర్చుని విద్యను బోధించే పవిత్రాసనంమీద కూర్చుని .... అనూహ్యము గురుదేవా? మీకు అంత విశ్రాంతి అవసరమైతే, మీ పాదముల దగ్గర కూర్చునే, నా కర్తవ్యాన్ని నిర్వహిస్తాను. అంతేకాని, మీరే యతులైనప్పుడు యీ తాపత్రయము నాకు మాత్ర మెందుకు స్వామీ? నడవండి, నేనూ మీ వెనకాలే వస్తాను.

అ:-నీకు మరో కర్తవ్యాన్ని కూడా ఆదేశిస్తున్నాను.

ని:-ఆజ్ఞ యివ్వండి. మీ సన్నిహితత్వాన్ని పోగొట్టుకో నంతవరకు, నా ప్రాణాన్ని యిమ్మన్నా యిస్తాను.

అ:-నీ స్వామిని సంగతి మరచిపోయావా?

ని:-ఎలా మరచిపోగలను గురుదేవా! ఈ క్షణంలోనే, ఆమె పాదాలమీదపడి మీ ఉద్దేశ్యాన్ని తెలియజేసి ...

అ:-(నవ్వి) నా ఉద్దేశ్యాని మళ్లించాలని ప్రయత్నిస్తావుకదూ? వెర్రివాడా, ఆమె ఏనాడో అంగీకరించింది.

ని:-ఆఁ! ఏమన్నారు? మాతృదేవి అంగీకరించారా? ఆ మహాసాధ్వి తన జీవితాన్ని చేజేతులా అంధకారమయం చేసుకోవడం నన్ను విస్మితుణ్ణి చేస్తోంది.

అ:-స్త్రీ ఎప్పుడూ త్యాగమయి, నిగమా! అందులో ఆశ్చర్యమేముంది?

ని:-క్షమించండి. ఒకప్రశ్న. ధర్మ ప్రబోధానికి అమలు కావాలన్న సూత్రం ఎక్కడుంది గురుదేవా?

అ:-సరళకూడా సరిగా యిదే ప్రశ్న వేసింది. ఒక్కసంగతి, మనం కామప్రవృత్తులమై, ఏ అధికారంతో ధర్మప్రచారం చేస్తాం? ఆనాడు లోకం మనమాటలను గౌరవిస్తుందా? కాబట్టి, యిక నామాటకు అడ్డుచెప్పక, నా ఆదేశాన్ని పాలించు. అదే నీ కృతజ్ఞతకు నిదర్శనం. ఆఁ చెప్పడం మరచి పోయాను – ఒక్క సంగతి.

ని:-శలవివ్వండి.

అ:-నీస్వామిని అంతర్వత్ని.

ని:-ఆఁ అటిసిథితిలో ఆమెను...

అ:-తొందరపడకు ఆమె ప్రసవించి, శిశువు పన్నెండు సంవత్సరాల యుక్తవచ్చేవరకు వారిమంచి చెడ్డలను గమనించే భారాన్ని నీమీద పెడుతున్నాను.

ని:-దానికి తగిన మానసిక శక్తినికూడా ప్రసాదించండి గురుదేవా?

అ:-నీధర్మ మార్గమే నీకాశక్తిని ప్రసాదిస్తుంది. ధైర్యం వహించు.

ని:-పిమ్మట మీపాదాలను అనుసరించడానికి అనుజ్ఞ యివ్వండి.

అ:-ఆశిశువుయొక్క భావ్యోన్నతి నీమీద ఆధారపడి ఉందన్న మాటమాత్రం మరచిపోవద్దు.

ని: నన్నిన్ని విధాలుగా బంధించి...

అ:-నీకు యిష్టంలేకపోతే చెప్పు నిగమశర్మా! నిన్ను బలవంత పెట్టను. పైన భగవంతుడున్నాడుగా అనాధనాధుడు.

ని:-క్షమించండి. మీ ఆజ్ఞలను తూ.చ తప్పకుండా పాలిస్తాను. అందుకు మీ పాదములుసాక్షి. కాని, ఒక్క కోరిక.

అ:-నామార్గానికి అడ్డురానంతవరకు తీర్చడానికి అభ్యంతరం లేదు.

ని:-మీపాదుకలను ప్రసాదించండి, వాటిని మీస్థానంలో నిలిపి, నా కర్తవ్యాన్ని నిర్వహిస్తాను.

అ:-ఎంత నిష్కల్మష హృదయం నీది నిగమా! నీవంటివాడు వంశాని కొకడుంటే, మనసంఘం యింత అధోగతికి పాల్పడియుండక పోవునేమో! యిక యింటికి వెడదామా?

ని -రాలేను, క్షమించండి. యీ క్షణం నుండి నేను యతినియమాలను పాటించ నిశ్చయించుకున్నాను. గురుదేవుల సమ

క్షంలో దీక్ష స్వీకరించే అదృష్టం మళ్ళీ నాకు కలగదు.

అ:-బ్రహ్మచర్యాశ్రమంనుండి సన్యాసాశ్రమానికి కప్పదాటు వేస్తున్నావా?

ని:-శంకరభగవత్పాదాచార్యులు మనకు మార్గదర్శకులు కాలేదా, స్వామీ!

అ:-సరే నీయిష్టం నువ్వింక స్వతంత్రుడవు కదా!

ని:-అపోహ పడుతున్నారు గురుదేవా! నాపాపానికి ప్రాయిశ్చిత్తం యిది.

అ:-యిక వెళ్ళిరానా నిగమా!

ని:-తిరిగి గురుదేవుల దర్శనం?

అ:-ద్వాదశవర్షానంతరం. భేదానందాశ్రమంలో.

ని:-ఒక్కసారి సాష్టాంగ నమస్కారం చెయ్యనివ్వండి గురుదేవా? తిరిగి పన్నెండు సంవత్సరాలకు కాని మీపాదదర్శనం లభించదు. (ఏడుస్తాడు.)

అ:-ఏడుస్తున్నావా, వెర్రివాడా నీజ్ఞానం అంతా ఏమయింది?

ని:-ధైర్యం వహిస్తున్నాను గురుదేవా?

అ:-దీర్ఘాయిష్మాన్ భవ. యీ స్థితిలో యింకేమీ ఆశీర్వదించలేను. నేను వెళుతున్నాను నిగమశర్మా.

ని:-గురుదేవా! (గట్టిగా అరచి, కూలబడిపోతాడు)

నాలుగవ రంగం

(మరునాటి ఉదయం సరళయింట్లో)

తండ్రి:-సరళా! (జవాబులేదు.) అమ్మా సరళా!... యిదేమిటమ్మా ఎప్పుడూ లేనిది యింకాలేవలేదు! తెల్లవారిందిలే అమ్మా.

సరళ:-(ఏడుస్తూ, తండ్రిని కౌగలించుకొని) నాబ్రతుకే తెల్లవారిపోయింది నాన్నా!

తం:-(తెల్లబోయి)అదేమమ్మా? ఏంజరిగింది, త్వరగా చెప్పు!

స:-మీ అల్లుడుగారు ....

తం:-నిన్నుగాని మందలించాడా? అయితే, అంతమాత్రానికే ఈ ఆర్భాటం ఎందుకమ్మా?

స:-లేదు నాన్నా. అలాజరిగినా అదృష్టవంతురాలినే.

తం:-(ఆతురతతో, అయితే, ఏం జరిగిందో త్వరగా చెప్పుమరి!

స:-గృహ పరిత్యాగం చేశారు.

తం:-ఆఁ!

స:-సన్యాసాశ్రమం స్వీకరించారు నాన్నా!

తం:-(జాలిగా) నీతో కాపరం అంత వెగటైపోయిందా! అమ్మా అతనికి?

స:-వెగటుకాదు నాన్నా, నాఖర్మ.

తం:-నీజీవితాన్ని నాశనం చేసి, తనేదో మోక్షం సంపాయిద్దామనుకున్నాడు కాబోలు!

స:-వారిని నిందించకు నాన్నా. వారు ధర్మ స్వరూపులు.

తం:-ఆఁ, ధర్మస్వరూపులు! యిదేకాబోలు ధర్మం! ఎక్కడికి పోయాడు?

స:-వారు మనకందరు నాన్నా.

తం:-ఎక్కడున్నాసరే, వెళ్ళి లాక్కొస్తాను. నువ్వు విచారించకమ్మా. నీజీవితాన్ని బుగ్గిపాలుచేసి పోతాడా! చూస్తాను.

స:-నాన్నా, వారు నాస్వామి. వారి సన్న్యాసాశ్రమ స్వీకారానికి నేనే మనఃపూర్వకంగా అంగీకరించాను, అందులో వారి తప్పులేదు.

తం:-(కోపంతో) అయితే నామీద పడి ఏడవడమెందుకు?

స:-ఎవరిమీదపడి ఏడిస్తే ఏం లాభం నాన్నా? భగవంతుడు ఉన్నాడుగా. వాడైనా నన్ను ఆదరించక పోతాడా?

తం:-(విచారంతో) ఊరుకో అమ్మా. ఏదో కోపంలో అనేశాను. నిన్ను నాకడుపులో పెట్టుకుని కాపాడుతాను; అయితే, ఎందుకమ్మా అంత అఘాయిత్యం చేశాడు!

స:-అఘాయిత్యం ఏముంది నాన్నా? ఉన్నత ఆదర్శంతోనే యతి అయారు. ధర్మ ప్రబోధంకోసం సర్వస్వాన్ని పరిత్యజించారు.

తం:-అయితే పాఠశాలో?

స:-నిగమశర్మను ఆచార్యునిగా చేశారు.

(బయట _ ఓం నమో నారాయణాయ)

తం:-చూడమ్మా, నిగమశర్మ గొంతుకలా ఉంది.

(సరళ వెడుతుంది. బయట)

స:-లోపలికిరా నిగమశర్మా! ఆకాషాయి బట్టలేమిటి? గురువుగారి ఆజ్ఞా?

ని:-క్షమించుతల్లీ! నిన్నరాత్రే గురు సమక్షంలో ఆశ్రమ స్వీకారం చేశాను.

స:-వెడుతూ, వెడుతూ, నీకూ ఆమార్గాన్నే చూపించారా?

ని:-ఇందుకు వారు బాధ్యులు కారుతల్లీ. నా పూర్వ జన్మ సుకృతం.

స:-యతి జీవితాన్ని సుకృతంగానే భావిస్తున్నావా?

ని:-అవునమ్మా, సుఖ దుఃఖాలను సమభావంతో ఎలాచూడాలో నేర్పగల పవిత్రాశ్రమం. అది అందరికీ లభ్యమౌతుందా! అమ్మా! సెలవు.

(నిష్క్రమిస్తాడు)

(సరళ యింట్లోకి వెడుతుంది)

తం:-ఎవరు, నిగమశర్మేనా అమ్మా!

స:-అవును నాన్నా. అతనుకూడా యతి అయిపోయాడు. మీ అల్లుడుగారు అనుమతించారట.

తం:-వెడుతూ, వెడుతూ అందరినీ సన్యాసులను చేసి వెళ్ళిపోయాడా?

స:-వారిని అని ఏం లాభం నాన్నా? ఎవరి ఖర్మ కెవరు కర్తలు!

తం:-నిజమేనమ్మా.

స:-(ఏడుస్తూ) నా న్నా నా బ్రతుక్కికేం కావాలి?

తే:-(ఓదారుస్తూ) నేనున్నాగా అమ్మా. నాకంఠంలో ప్రాణం ఉన్నంత వరకూ నీకూ, నీశిశువుకూ ఏలోటు రాకుండా కాపాడుతాను. అటుపైన దేవుడే ఉన్నాడు.

స:-నాన్నా! (గట్టిగా అరిచి, మూర్ఛపోతుంది.)

—(౦)—






## వేరు శెనగ కట్‌లెట్

1 ఆళాకు వేచిన వేరు శెనగ పిక్కలు తీసుకొని దానిని మెత్తని పొడిగా చేయుము. 2 టేబిలు స్పూన్లు శనగ పిండిని కలిపి బాగుగా ముద్దగునట్లు సాగగొట్టుము. వీనికి 1 టీస్పూన్ మెంతికూర, 1 పచ్చి మిరపకాయ, బాగా చెక్కు తీయబడిన 2 పాయల ఉల్లిపాయలు కలిపి వాటిని చిన్న ఉండలగాచేసి, ఒక్కొక్క దానిని కట్‌లట్ (వడ) రూపంగా చేసి నూనెలో వేయుము.

## క్యారెట్ భుజియా

2 క్యారెట్ దుంపలు తీసుకొని బాగుగాకడిగి ముక్కలుచేయుము. కొంచెము అల్లం, 1 టీస్పూను కొత్తమిరి, 1 పచ్చి మిరపకాయ, జీలకర్ర బాగా నూరుము. నూనె వేడిజేసి, మసాల సామగ్రిచేర్చి, 1 ఉల్లిపాయను చిన్నవిగా తరిగి, 1/8 టీస్పూను ఉప్పు, 1 చిటికెడు పసుపు అన్నియు బాగుగా కలిపి 2 చెమ్చాలు నీరు చేర్చి, ఒక పాత్రలోవేసి, మీద మూతవేసి, మెత్త పడేవరకు ఉడికించుము.

కుమారి సి. ఏ. లీలావతి.

## జొన్నపిండిదోశ

జొన్నలు సాధారణముగా బీదవారి ఆహారమయినా పుష్టికరమయినది. పక్వముగా ఉపయోగించేట్లయితే అందరు ఆహారంగా ఉపయోగించవచ్చును.

రెండు రామమునగకాయలగుజ్జును, ఒకటిగాని, రెండుగాని పెద్ద ఉల్లిపాయలు చిన్నచిన్న ముక్కలుగా తిరిగి అరకప్పు చిక్కని మజ్జిగలోవేసి, కొంచము ఉప్పు, పసుపు, కావలసియుంటే కొద్దిగా కారంవేసి బాగా కలిపి యంచుకొనవలెను. దానితో ఉడకబెట్టిన జొన్నపిండిని తగుమాత్రంగా కలిపి పెనంమీద నెయ్యిగాని, నూనెగాని రాచి దానిమీద అట్లమాదిరిగా వేసి, దానిమీద 1,2 చంచాల నూనెగాని, నెయ్యిగాని వేసి ఎర్రగా కాలేబాకా ఉంచాలి. తర్వాతతీసి పలహారముగా నుపయోగించిన రుచికరముగా నుండును.

## కారపుకాయలు

కాకరకాయలు, వంకాయలు, బెండకాయలు, దొండకాయలు కారపుకాయలుగా చేయడానికి అనువుగానుంటవి.

కొద్దిగా పచ్చి శనగపప్పు, మిరపకాయలు, దోరగావేయించి, అందులో యిష్టమున్నవారు చిన్న ఉల్లిపాయ, లేదా ఎండుకొబ్బరి, ఉప్పువేసి బాగుగా పొడికొట్టుకొని యుంచుకొనవలెను.

కాకరకాయలను నిప్పులలో వేసి శగకు మ్రగ్గి మెత్తబడగానే తీసి వాని పొట్టలను చించి అందులో కొట్టిపెట్టుకొనియున్న పొడిని తురిమి బాణట్లో నెయ్యిగాని, నూనెగాని వేసి అందులో కాయలనుంచి వేగిన తరువాత దించి భోజనములోకి అనుపాకముగా నుపయోగించిన చాల రుచిగానుండును. ఇదే విధంగానే బెండకాయలను కూడ కారపుకాయలుగా చేయవచ్చును.

వంకాయలను ప్రతికాయను నాలుగుపక్షములుగా ముక్కలు విడిపోకుండా తరిగి కొట్టిపెట్టుకొని యున్న పొడిని పక్షముల మధ్యనయుంచి తప్పతోగాని, నూలుదారముతోగాని పొడిబయటికి రాకుండా కట్టవలెను. వానిని బాణలిలోని నూనెలోగాని, నెయ్యిలోగాని, బాగా మ్రగ్గునట్లుంచవలెను. దీనినే నూనె వంకాయనికూడ అంటారు. ఇదే విధముగా దొండకాయలను కూడ చేయవచ్చును.

చివుకుల లక్ష్మీకాంతమ్మ

―o―

# శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారి కభినందనము

శ్రీమతి దేశిరాజు భారతీదేవిగారు

శ్రీమతి లక్ష్మీకాంతమ - భామాతిలకంబమేయ భాషావిభవో
ద్దామోపన్యాస యశో - ధామకు చిరాయువు నొసంగు దైవము కరుణన్.

కవితామ తల్లిసంభవసీమ రాజమాహేంద్రంబు తనపుట్టినిల్లుగాగ
ఆంధ్రోద్యమారంభ మవతరించిన భావపురము తావసియించుపురముగాగ
విస్తరవ్యాపార విభవమా చీరాల యెలమిమైతా మెట్టినిల్లుగాగ
సాహితీకన్యకు సకలాంధ్రదేశంబు పూతమైన విహారభూమిగాగ
పుట్టినింటికి మెట్టినపురమునకును - పేరుదెచ్చిన మానిని పెంపుసొంపు
ధన్యత సువర్ణకంకణ ధారణమున - ముమ్మరురహించు లక్ష్మీకాంతమ్మ కెలమి

స్వరచితోపన్యాస పటల మెల్లరకును పఠనీయమైన కావ్యములుగాగ
కవయిత్రి కామణీ కావ్యవిమర్శక, గ్రంథంబు పాండితీ ఘనముగాగ
కవిత విపంచికాగాన విస్ఫురణంబు శారదాలాస్య విస్తరణగాగ
విమల సతీత్వంపు విశ్రుతఖ్యాతి సంభరిత పావనమైన చరితగాగ,
నాంధ్రకాంతల కూర్మికి నాటపట్టు - నిజ్జగతి మానినుల కెల్లనొజ్జబంతి
ఊటుకూరి హయగ్రీవు నుదధిరత్న - మైన లక్ష్మీకాంతమ్మ జిరాయుకాత.

తనవాగ్ధారన సారభావములు చిందన్భారతీ తాస్యజ్యం
భణ లావణ్య ఘనస్వరూపమనుచున్ మాబోటులగ్గింప, ని
త్యనవీనస్ఫురదాకృతుల్ వెలుగునత్యానంద సంధానమై
వినుతింపందగు లక్ష్మీకాంత యువతీవిద్యా విలాసంబులన్.

కంకణ బహూకృతులు లక్ష్మీకాంతమకును-జరుగునని వినిముద్ధమున సంతసంబు
గాంచిసంతుష్టినందిత చంచలముగ - దాతకు గృహీతకభివృద్ధి దైవమిడుత.

---

(ఈ యభినందనములతోబాటు 'కృష్ణమహీమార్దవమ'ను గ్రంథమును రచించి రచయిత్రి శ్రీ కేసరిగారికి అంకితముగా పంపినది.)

—(౦)—

# కంకణగృహీతప్రశంస



శ్రీకరంబైన విఖ్యాతి చెన్నుమెఱయ - సిరియు వాణియు సఖులయి చెంతనిల్వ
వంశమునకెల్ల సత్కీర్తి వెలయఁజేసి - మహిని నెల్లర మెప్పును బడసినావు ॥

కవిజీవితంబులారవితారకంబుగా - కావ్య సృష్టిని, నిల్పి, ఘనతకెక్కి
స్వర్ణాక్షరంబులు స్వయముగ లిఖియించి - స్వర్ణకంకణమును సరగఁదాల్చి
గృహలక్ష్ములను మేటి గృహలక్ష్మివై యొప్పి - కవయిత్రివీవను ఘనతగాంచి
వక్తృత్వమందును వాక్యరచనయందు - రెండింటిలోన పేరెన్నికఁగని
మధుర కవికావ్య కన్యకామంజులీలఁ - బుట్టిపెరిగిన గారాలపట్టివగుచు
వరప్రభుత్వ గౌరవమంది వఱలినావు - ధన్యవీవమ్మ లక్ష్మికాంతాలలామ ॥

పూపప్రాయమునందె పూవుపరిమళరీతి - నిండుసత్కీరితి, నిలిపినావు
చిరతరైశ్వర్యంబు సిరిసంపదలఁదూగి - శ్రీశుకరుణచేత చెలగినావు
కంకణంబునుఁదాల్చి కరపల్లవమునందు - నన్యోన్య శోభచే నలరినావు
కవుల మన్ననగాంచి కన్నుల పండువుగాగ - సన్మానమును పొందఁజాలినావు
వయసునకు పిన్నవైనను విద్యలందు - ఆరితేరిన ప్రౌఢవై యశమునింపి
జాతికంతటికిని పేరుచాటినావు - నిన్ను నుతియింపఁదరమె మాచిన్నలక్ష్మి!

## కంకణదాతగారిప్రశంస

సరసపురాణముల్ చదువంగ నేర్చిన - సాధ్వీమతల్లుల సరస నిలిచి
చిత్ర విచిత్ర ప్రబంధాలు చిత్రించు - చెలువల సభయందుఁ జేరబిలిచి
దానకంకణమొప్ప దాల్చినధీరుడన్ - సార్థకంబైనట్టి జన్మఁదాల్చి
వరసతీమణులకు కరకంకణములిచ్చి - తనువును ధనమును ధన్యమొప్ప
జగమునంగల 'స్త్రీ' జగదంబుదివ్య - మూర్తియను భావమెల్లర మనములందు
నెలకొనగజేసి ప్రఖ్యాతి నొందినట్టి - కేసరీనామపుణ్యుని ఘనత పొగడ
నాదిశేషునకైనను నలవియగునె ?

పుణ్యపురుషుండు కేసరీ బుధవరుండు - దాతృనామంబు దాల్చిన ధవళయశుడు
సర్వకాలంబు సంపూర్ణయశముగనుచు - ఆయురారోగ్యభాగ్యంబు లందుగాక !

కె. చంద్రమతి




(గతసంచిక తరువాయి)

'తిను' అన్నాడతడు.

నాకక్కర్లేదన్నాను.

'ఏం తింటావు?'

ఏమైనా పళ్ళుగాని దుంపలుగాని యియ్యమన్నాను. అన్నం దొరకదు, గుడిసెలోంచి ఏవో రెండు పండ్లు నాలుగు దుంపలు తీసుకొచ్చి యిచ్చాడు. నాకష్టాలను తలుచుకొంటూ తింటున్నాను. వాళ్ళదేపనిగా నావంక చూస్తున్నారు. నేనేమీ మాట్లాడలేదు. ఇచ్చిననీరు త్రాగాను. ఆకలి కొద్దిగా తగ్గింది. కళ్ళుమూసుకు పోతున్నై. ప్రక్కకు వాలాను. నిద్రపోయాను. వాళ్ళదేపనిగా ఏమనుకొన్నారో ఏమో!

సూర్యుడు తన తీక్ష్ణకిరణాలతో నన్ను మేల్కొలిపాడు. బారెడు ప్రొద్దెక్కింది. సూర్యగమనం అధికమైంది. వాళ్లునన్ను చూచారు. 'ఊరికి వెళ్తున్నాం! మాతో వస్తావా?' అన్నారు.

'ఏవూరు!'

'యీప్రక్క నుండేవూరే!'

ఆవూరిపేరు నాకుతెలుసు. అక్కడేదైనాపనిచేసుకొని బ్రతుకుదామని 'సరే' నన్నాను. త్రోవలోనే నన్నిసంగతులు అతనితో చెప్పాను. 'ఊఁ' కొడుతూ ఏవేవో ప్రశ్నలువేస్తూ నడుస్తున్నాడు పాముల బుట్టల కావడి బుజాన వేసుకుని. అతని భార్య నెత్తిన మూట ముల్లె పెట్టుకొని మమ్మనుసరిస్తున్నది. ఊరిపొలిమేరదాకా వచ్చాము. అతడడిగాడు.

'నువ్వు ఎప్పుడూ మాతో వుంటే నీకు కావల్సినవన్నీ యిస్తాము!'

నాకేమీ మాట్లాడటానికి తోచిందికాదు. ఏమీ తెలియలేదు. అతడు మాట్లాడుకు పోతున్నాడు.

'నాతో వుంటే పాములాట నేర్పుతాను. పాముల్ని పట్టుకోవటం వాటిని ఆడించటం అన్నీ నేర్పుతా. మంత్రాలువచ్చు. అన్నీ నీకుచెపుతా. మందులూ అనేకం వున్నై. నాదగ్గర. నీయిష్టమొచ్చినట్టు వుండొచ్చు!'

నేను మాట్లాడలేక పోయాను. 'యీదౌర్భాగ్యుడికింతలో యింత అదృష్టమా' అని అతనివైపు ఒక్కసారి ఆశ్చర్యంగా చూశాను. ఉండి వుండి వళ్లు వణకటం మొదలుపెట్టింది. లోపల భయమధికమైంది. ఎరక్కవచ్చి వీళ్ళవలలో పడిపోయాను. నన్ను నేనే బంధించుకున్నాను. యీపాములవాళ్ళు పిల్లలు కనబడితే మాయమాటలు చెప్పి తీసుకుపోయి అమ్ముతుంటారు. కొన్నవాడు పెట్టేకష్టాలు చెప్పుకోటానికి గూడా తరంగాదు. పరుగెత్తటానికి కాళ్ళాడలేదు. ఆలోచన అంతకన్న లేదు. నేనెవరికో అమ్మబడుతాను. వాళ్ళు నన్ను ఏవిధమైన బాధలు పెడతారోనని నామనస్సు పరిపరి విధాల ఆరాటం పడింది. కాని ఏం లాభం! ఒకచోట కష్టాలు తప్పించుకోటానికి వచ్చి మరొకచోట కష్టాలకు గురియైనాను. నాకాళ్ళకు బంధాలు నేనే తెచ్చుకున్నాను.

పొలిమేరదాటి ఊళ్ళో ప్రవేశించాము. రెండు మూడు బారల ప్రొద్దెక్కింది. బజారు మధ్యలోకి

తీసుకువెళ్ళాడు. ఊరివారంతా ఆదోవిధంగా చూస్తున్నారు మమ్మల్ని. నాకూ, వాళ్ళకూ ఎక్కడా పోలిక లేకపోటమే అందుకు కారణ మనుకున్నాను. ఊరిమధ్య తనసరంజామా నంతా దించి డప్పు కొట్టటం మొదలు పెట్టాడు పాములవాడు. జనం పోగౌతున్నారు. కాసేపటి తర్వాత నన్ను కొట్టమన్నాడు, డప్పు! నాకు చేతకాదన్నాను. 'కొట్టు అదే చేతవుతుంద'న్నాడు. పుల్లతో దాన్ని దబ దబా బాదుతున్నాను, సత్తువకొద్దీ! అతడు పిల్లంగ్రోవి ఊదుతున్నాడు. ముసలివాళ్లు, పిల్లలు అందరూ గుమిగూడారు ఏదో వింత జరుగుతున్నట్లు! కాస్సేపు ఉపన్యాసం కొట్టాడు పాములవాడు. నవ్వించాడు. తమాషాలు చేశాడు. లోపల నాకు భయం తీరలేదు! కాసేపు పాముల్నాడించాడు! తర్వాత యిలా అన్నాడు!

'మీరంతా చూసిన వాటికన్నా, విన్నవాటికన్నా గొప్పదాన్ని చేస్తాను చూడండి! యిప్పుడీ పిల్లవాడిని భూమికి రెండు గజాల ఎత్తున ఆధారం ఏమీ లేకుండా గాలిలో నిలబెడతాను!' అని నన్ను చూపించి అంటూంటే నా మీది ప్రాణాలు మీదనే పోయినై. నన్ను గాలిలో నిలబెట్టటమా! ఎవడి శక్యం! డప్పుకొట్టడం ఆపి లేచి పరుగెత్తబోయాను. నా సంగతి యిదివరకే తెలిసికున్నవాడిలాగా రెక్కపట్టుకొని ఆపాడతడు. ఏడవటం మొదలుపెట్టాను. అంతా గొల్లున నవ్వారు! ఎవరో అన్నారు, 'భలేవాడయ్యా! నీ కొడుకు. తగ్గాడే!' అని మళ్ళీ నవ్వాడు. అతనూ నవ్వాడు! 'నాకొడుక్కాదు బాబూ! కొత్తరకం! అడవిలో పట్టుకొచ్చా! చెప్పకుండా పారిపోయి వచ్చాడు. కనబడటంలా!' నేనారున్నొక్క రాగమతిక్రమించి పాడసాగాను. కొందరికి నా ఏడుపు నవ్వును, కొందరికి సానుభూతిని కలిగించింది. తలొకమాటా అంటున్నారు. 'నన్ను విడిచిపెట్టు నేను పోతా!' నని పెనుగులాడుతున్నాను. 'అడవిలో దొరికాడు! కూడు నీళ్ళిచ్చి. తోడుకొచ్చాను' యింటిపనులు చేస్తాడు. ఎవరికైనా కావాలంటే...! ఇంకేముంది నేననుకున్నంతా అయింది. ఇందాక అతగాడన్న మాటలన్నీ వట్టిబూటకాలని ఎప్పుడో తెలుసుకున్నాను. ఊహించింది నిజమైంది. ఎవరికో అమ్ముడుబోక తప్పదు. యావజ్జీవఖైదీ ననుభవించాల్సిన గతిపట్టిందని భావించాను. ఎన్నో మాటలన్నాను. బతిమిలాడాను. నన్ను పోనీయమని. విడవలేదు. ఒకరిద్దరు బేరాలకు దిగారు. నేనూరికే పెనుగులాడటం తప్ప నా ప్రయత్నం విఫలమైంది. ఏడుస్తూ అశ్రుపూరిత నేత్రాలతో అగుంపునంతా ఒక్కసారి కలయ చూచాను. నన్ను రక్షించే నాథుడు కనబడకపోతాడా అన్నట్లు! ఎవరేమంటున్నదీ, అతగాడేమంటున్నదీ తెలియలేదు. ప్రపంచం తల్లక్రిందులైనట్లుంది. కళ్ళు తిరిగినై. కాళ్ళమీదపడి బ్రతిమిలాడాను విడిచిపెట్టమని. లాభం లేకపోయింది. అక్కడున్నవన్నీ రాతిగుండెలే నా?

ఒక వృద్ధుడు నాదగ్గరకొచ్చాడు. నువ్వెవరన్నాడు. చెప్పాను లెమ్మన్నాడు. ఆశ్చర్యపోతూ లేచాను. నాదగ్గరుంటావా అన్నాడు. ఆయన ముఖంలో ఏదో ఒక వింత ఆకర్షణ కనిపించింది. నా అంతరాత్మ నీకింతకన్నా మంచిచోటు లభించదని చెపుతున్నట్లనిపించింది. తలూపాను. బేరం ఫైసలైంది. నాకగమ్యగోచరంగావుంది. నిన్న ఎక్కడున్నానో యీరోజు ఎక్కడున్నానో!

ఆవృద్ధుడి వెంబడి అతని యింటికి గొనిపోబడ్డాను. లోపల ప్రవేశిస్తూ 'అమ్మా! నీలా!' అని పిలిచాడు. లోపలినుంచి 'వస్తున్నా తాతా!' అనే మృదులస్వరం వినబడ్డది. 'నీకొక అన్నయ్యను తెచ్చానమ్మా!' అంటూ లోపలికి నడిచాడు వృద్ధుడు. 'అన్నయ్యా?' ఆశ్చర్యకరంగా పలుకుతూ 10, 12 సంవత్సరాల కన్నెపడుచు 'నీల' ప్రవేశించింది. నన్ను చూచి బెరకుగా తాత చాటుకు పోయి దాక్కున్నది. నాకత్యాశ్చర్యం కలిగించింది యిలా అంటాడేమిటా అని!

'భయంలేదులే అమ్మా! అడుగో నీ అన్నయ్య!' అని ఆమె శిరము మూర్కొని కుర్చీలో కూర్చొని మనుమరాల్ని ఒడిలో కూర్చోబెట్టుకున్నాడు.

'నువ్వుకూడా కూర్చో నాయనా'

నేను క్రిందకూర్చో బోవటం గ్రహించి 'అక్కడ ఆ వాలు కుర్చీలో కూర్చో' అన్నాడు. నాకంతా అగమ్యగోచరంగావుంది. బానిసగా అమ్ముడు పోయిన నాకు యీమర్యాదలేమిటి! నాకేదో ఒక విధమైన ఆనందం, ఆశ్చర్యం కలిగింది.

కొంతసేపటికి ఆయనే యిలా అన్నాడు.

'నాయనా! నీదేవూరు? వీళ్ళకెలా చిక్కావు! నీసంగతి సందర్భాలన్నీ విపులంగా చెప్పు. ఏమీ భయపడ నక్కర్లేదు. నీ శ్రేయస్సు కోరేవాడిని! నిన్ను చూస్తే ఎందువల్లనో అవ్యక్తమైన జాలి కలుగుతూంది!'

ఏం చెప్పేది? నాకు నోరుతెరవటానికే ధైర్యం చాలిందికాదు. నిజం చెప్పితే మళ్ళీ నన్నా నరక కూపంలోకి తీసుకు వెళ్ళుతాడేమో నని సంశయిస్తున్నాను.

ఆయన ఇది గ్రహించాడు. 'ఏమీ భయం లేదు నాయనా! మీవాళ్ళెవరో, ఎక్కడున్నారో, ఎందువల్ల నీకీకష్టాలు కలిగినాయో నాతో చెప్పు. వీలైతే నిన్నాకష్టాలనుంచి తప్పించేమార్గం చూస్తా నన్నాడు. ఈమాటలు వింటూంటే నాకాయన దైవ సమానుడుగా తోచాడు. అప్పుడునియందు పితృభావం కలిగింది. అనుమాన పిశాచాలు నన్ను వదిలి పోయినై. నాపుట్టుపూర్వోత్తరాలు అన్నీ ఆయనకు వివరంగా చెప్పాను.

నాకథంతా విని ఒక్క వేడినిట్టూర్పు విడిచాడు. ఏమంటాడో నని ఆతృతతో ఎదురు చూస్తున్నాను.

'తల్లిదండ్రీ లేని పిల్లల అవస్థ యిలాగే వుంటుంది తండ్రీ! బంధువులు కప్పల్లాంటివారు! సిరిచేరితే అందరూ మనవాళ్ళే అవుతారు. ఇటువంటి కష్టసమయాల్లోనే ఎవ్వరూ దరికి రారు! ఇదిలోక సహజం! నేనొక మాట చెప్పుతాను వింటావా నాయనా!' అన్నాడు ఆయన.



కృష్ణాపిక్చర్స వారి "అమ్మ లక్కలు" లో డా. శివరామ కృష్ణయ్య మరియొక నటుడు

'మీరు మళ్ళీ నన్ను యమలోకంలోకి పంపకుండా వుంటే ప్రాణాలిమ్మన్నా యిస్తాను. నాజీవితపర్యంతం మీపాదసేవచేస్తూ కాలం గడుపుతాను.' అని అన్నాను.

నామాటలకాయన నవ్వి 'నాకుమాత్రం తెలియదా నాయనా! కష్టాల్లో ఉన్న మనసు అందులోనుంచి కడతేరాలని చూస్తుందికాని అందులోనే పడి యీదాలని కోరుతుందా? నేనూ అటువంటి అవస్థలోనే వున్నాను. ఇటుచూడు నాయనా! నామనుమరాలు! ఒక్కగా నొక్క కొడుకు కూతురు. ఈపిల్ల తల్లి ప్రసవించి చనిపోయింది, నాకొడుకు గూడా మమ్మల్ని యిలా చేసి వెళ్ళాడు. ఇంకనేనొక్కడినే జీవచ్ఛవంగా వున్నాను. నేనెప్పుడు కళ్ళుమూస్తానో నాముద్దులపట్టి నీల ... !' ఆయన కంఠం రుద్ధమైపోయింది. కన్నీళ్ళు బొటబొటమని రాలినై! నీలకిదంతా అగమ్యగోచరంగా వుంది.

'నేను విశ్రాంతి తీసుకుండేకాలం ఆసన్నమైంది తండ్రీ! ఈపిల్లకింకెవ్వరూ ఆసరాలేదు! అనాధుడికి అనాధుడే సాయపడతాడు కాని నాధుడు సాయపడడు. కాబట్టి నువ్వు నాదగ్గరుండి మీచెల్లెలి భారం వహించటం నీకసమ్మతమేనా! ఇంక నీవే యీపిల్లకు తల్లీ దండ్రీను! మీయిద్దర్నీ రెండు కళ్ళుగా చూచుకుంటూ నాజీవితశేషం వెళ్ళబుచ్చుకుంటాను.

ఇంతవరకు సుఖమన్నమాట గూడా విని ఎరుగని యీపరమ దౌర్భాగ్యుడికి యింతలో యింత అదృష్టమా! ఇది నిజమా కలా అనిపించింది! నన్ను నేనే నమ్మలేకపోయాను! ఆనందబాష్పాలు నాకు తెలియకుండానే ప్రవహించినై. నాతండ్రి పాదాలమీద వ్రాలాను! మీరు నాప్రాణదాతలు! మీకు నేను దాసుడిని! మిమ్మువిడిచి ఒక్కక్షణం గూడా వుండను. మీపాదసేవ చేస్తూ నాజీవితం మీకంకితం చేస్తాను, మీ ఆజ్ఞ శిరసా వహిస్తున్నాను!' అన్నాను.

నాటితో నాజీవితంలో నూతనాధ్యాయం ప్రారంభమయింది. నిరాశా, నిస్పృహలతో మోడువారిపోయిన నాజీవితం మళ్ళీ చిగిర్చి వింత వింత కాంతుల నీనటం మొదలు పెట్టింది. నీల, నేను ఒక తండ్రిబిడ్డలమైనాము. మాసోదర సోదరీ ప్రేమ అత్యున్నత స్థాయినందుకున్నది. ప్రతిదినం విద్యావ్యాసంగాలతో, విలాస క్రీడలతో ప్రొద్దుపోయేది. మాబాబు మమ్మల్ని చూచి ఆనందిస్తుండేవాడు. ఇలా రోజులు దొర్లుకు పోతున్నాయి!

(ప్రథమభాగం సంపూర్ణం)

# రంగోలి

శ్రీమతి కె. గురులక్ష్మి

రంగోలీ: ఈ లలితకళా సాంప్రదాయపు ముగ్గులు తీర్చుటకు తెల్లని సున్నపుపొడి 4, 5 యితర రంగుల భస్మములు ఉపయోగించుచు స్త్రీలు, బాలికలు హిందువుల పండుగదినములలో తమ యిండ్ల ముంగిళ్ల యందుచేయు చిత్రకళా వైదగ్ధ్య రచనము. ఇది సామాన్యమైన (free-hand out-line drawing) కాగితములమీద చిత్రకళాకుశలులైన చిత్రకారులు పెన్సిలుతోచేయు రచనమును పోలినదే. స్త్రీలు, బాలికలుచేయు రంగవలీరచనము (ముగ్గులు పెట్టుట, తమిళమున 'కోలము' పెట్టుట). ఈ రంగవలీ రచనమే వివిధమైన రంగులతో చక్కని విన్యాసములను ప్రకటించుచు చేయు చిత్రకళా ప్రదర్శనమునకే 'రంగోలి' యందురు. ఈ రంగోలీ కళలను ప్రదర్శనమునకై చేయు రచనలలో జంతువులు, దేవతామూర్తుల చిత్రములు, శ్రీకృష్ణుని బాలలీలలు రామాయణమందలి కథాసన్నివేశముల చిత్రములు రచింపబడుచున్నవి. ఈ కళ మన దేశమున చాలా ప్రాచీనకాలమునుండియు నెలకొనియున్నది. కాని ఆంగ్లేయ నాగరకతా ప్రభావ విజృంభణము విశృంఖలముగ మనదేశమున సాగునపుడీ లలితకళలు నిగురుగప్పిన నిప్పువలె నిరూఢమై మనదేశమున నిలచియున్నవి. వీనికి రాజపోషణములేక నశించినవని చెప్పవచ్చును. కాని మనప్రాచీన నాగరికతలోగల వైశిష్ట్యములను గుర్తించి ఆయాకళలను పునరుద్ధరించుకొనుచుండు నీ రోజులలో యట్టి లలితకళలలో ప్రజాస్వామ్య ప్రభుత్వము చేయూత నియ్యవలసియుండును. ఇటీవల భరతనాట్యము, కథాకళి, కూచిపూడి భాగవతుల భరతనాట్యాది లలిత కళలకు ప్రజాప్రభుత్వము పోషణముచేయ సంకల్పించి ఢిల్లీలో సెంట్రల్ గవర్నమెంటువారె యొక సంస్థను నెలకొల్పిరి. ఆ సంస్థలో జెష్టిస్ పి. వి. రాజమన్నారు నాయుడు గారు ఒకరు.

పూర్వము నుండియు చిత్రకళా కుశలురకు సంస్థానాధిపతులు వేతనములిచ్చి పోషించుచుండినందువలన వారి చిత్రకళ, డ్రాయింగు ఈరంగుల ముగ్గులతో రామకృష్ణాద్యవతార లీలలను నేలపై దేవాలయ ప్రాంగణములలో రచించుచు ప్రదర్శించుచుండిరి. ఇప్పటికిని ఈసదాచారము తిరుపతి దేవస్థానము వారవలంబించుచున్నందుననే తిరుపతిలో కోదండరామస్వామి వారి యాలయములో మండపమునగల యొక తిన్నెపై భాగవతమునుండి శ్రీకృష్ణునిలీలలు, రామాయణమునుండి రాముని కథావళులను యీ 'రంగోలి' చిత్రరచనా ఫక్కిగా దేవస్థానపు చిత్రకారుడు చిత్రించుచున్నాడు. ధనుర్మాసములో తెల్లవారు ఝామున కానవగును. ప్రస్తుతపు మన ప్రజాస్వామ్య ప్రభుత్వమిట్టి చిత్రకళకు కావలంబమీయవలయును. ప్రాచీనకాలమున దేవాలయ పాలకులు ధర్మకర్తలునగు జమీందారులును రాజులు ఇట్టిచిత్రకళలకు పోషణ మొసంగుచుండిరి. ఇట్టి కళలన్నో నేటి కాలము, రూపు చెడి యున్నవి.

# ఆంధ్ర జానపద గేయ వాఙ్మయ చరిత్ర

## జానపద విజ్ఞానం

(ఈ వ్యాసంయొక్క కాపీరైటు పూర్తిగా రచయితది)



శ్రీ ఉకుమళ్ల కామేశ్వరరావు

జానపదవిజ్ఞానం (Folk tone) యొక్క ప్రసిద్ధిని గుర్తించిన తర్వాత ప్రపంచకంలో అన్నిప్రాంతాలలో కూడ దానిని సేకరించడానికీ, వృద్ధిపరచడానికి విజ్ఞానులు పాటుపడ్డారు. ఆ కృషిలో అతి నవీనంగా జరుగుతూన్న ప్రయత్నాలను మాత్రమే ఇక్కడ కొంత ఉదాహరిస్తాను.

ఐరోపాఖండంలోని హంగేరి దేశంలో హంగేరియన్ రేడియోడైరక్టరైన లజ్‌త అనే ఆయన ఇద్దరి మిత్రులతోడ్పాటుతో హంగేరీ జానపదగేయాలను సేకరించేడు. (B. B. C. London Letter No. 392) అమెరికాదేశస్థులు జానపదగేయాలను సేకరించుకోడానికి చాల పాటుపడ్డారు. ఆ గేయాల ప్రదర్శనలుకూడా తరుచు జరుగుతూంటాయి. 17వ శతాబ్దంలో వ్యాప్తిలో ఉన్న జాతీయగేయాలు నేటికి కూడ వినిపిస్తుంటాయి. అమెరికా కాంగ్రెసు గ్రంథాలయం వారు 40,000 జానపదగేయాలను సేకరించేరు (అమెరికన్ రిపోర్టరు తెలుగు ప్రతి 25-7-52 పుట 2) ఫాబియన్ బవర్సు అనే అమెరికా పత్రికా రచయిత ప్రపంచకంలోని జానపద నాట్యాలను పరిశీలిస్తూ భారతదేశంకూడ వచ్చేరు. ఈయనకథ కన్యత్యాన్ని, మణిపుర నృత్యాన్ని పరిశీలిస్తున్నారు.

ఈయన భారతీయ నృత్యం (The dance in India) అను గ్రంథాన్ని ఆంగ్లంలో ప్రకటిస్తారు (అమెరికన్ రిపోర్టరు, తెలుగు ప్రతి 9-1-53) ఈ మొత్తంగా ప్రపంచకంలో జానపద కళలమీద శ్రద్ధాభిరుచులు నా నాటికి వృద్ధమవుతున్నాయి.

### జానపద విజ్ఞానం అంటే ఏమిటి? *

ప్రాచీన కాలంలో ఒక్కొక్క తెగవారు ఒక్కొక్క విజ్ఞానాన్ని సృష్టించి ఆనందిస్తూండేవారు. ఆ తెగతోపాటు ఆ విజ్ఞానంకూడ విస్తరించేది. దీనిని మూడు వర్గాలుగా చెయ్యవచ్చు. ౧. నమ్మకాలు. ఆచారాలు, ౨. కథనం, ఉక్తులు, 3. కళ, కథలలో కేవలం వాచకకథలుగాక వీధినాటకాలు, తోలుబొమ్మలాటలు, పిచ్చుకుంటుకథలు, జంగంకథలు, పంబకథలు, బైనీటిసుద్దులు ఇత్యాదులున్నాయి.

---

* దీనిని గురించి ఎక్కువగా తెలుసుకోదలచినవారు నేను ప్రకటించిన సాంప్రదాయిక విజ్ఞానం మొదటిభాగం అనే పుస్తకాన్ని చూడవచ్చు.

తెలుగు కవిత్వం నాలుగు విధాలు : ఆశు, మధుర, చిత్ర, విస్తరము. వాటితో మధురకవిత్వంబన్నది నాటకాలంకారంబులు, కళికోత్కళికలు, విభక్త్యర్థి దేవతోదాహరణములు, సప్తతాళనటనలు, నట్టోట్లు, గీతప్రబంధములు, చతుర్భద్రికాష్టభద్రికలు, బిరుదావళి, నామావళి, భోగావళి, రంగఘోష, త్యాగఘోష, చతురుత్తం సంఘటనలు, యక్షగానంబున వెలయు పదంబులు, దరువులు, నేలలు, ధవళంబులు, మంగళహారతులు, శోభనంబులు, సుయ్యాలజోలలు, జక్కుల రేకుపదంబులు, చందమామ సుద్దులు, అష్టకంబులు, ఏకపద, ద్విపద, త్రిపద, చతుష్ట దాష్టపదులు నివియాదిగ గల్గునన్నియు అని లక్షణ దీపకలో చెప్పబడ్డాయి.

కాని జానపదగేయాలు పైన చెప్పబడిన వర్గాలలో కొంతవరకు కథనంలోను, కళలోను కూడా ఉన్నాయి. వాటిని ఈ క్రింది తరహాలుగా విభజించవచ్చు. 1. జంగం కథలు 2. పౌరాణికగేయాలు 3. పూర్వపదాలు 4. స్త్రీలపాటలు 5. అర్వాచీన పదాలు 6. వాగ్గేయాలు, 7. తత్త్వాలు 8. ఖండ గేయాలు 9. జంగంచరిత్రలు

## సేకరింపు ఉద్యమం

తెలుగు భాషలో జానపదగేయాలు ముఖ్యంగా దీర్ఘమైన వాటిని, స్త్రీలపాటలను కొన్నిటిని ప్రకాశకులు క్రీ. శ. 1900 ప్రాంతమందే గుజలీ ప్రతులుగా అచ్చువేసి కాపాడేరు. కాని చిన్నరకపు రచనలకి మాత్రం అట్టి ఆదరణ కలగలేదు. మా తండ్రిగారైన టేకుమళ్ల అచ్యుతరావుగారు 1917లో ఆంధ్ర పదములు - పాటలు అనే వ్యాసాన్ని కృష్ణా పత్రికలో అచ్చువేసేరు. దాని వల్ల విద్యావంతులకు ఈ పాటలయొక్క ప్రసిద్ధి తెలిసింది. కాని సేకరించే ప్రయత్నంమాత్రంలేదు. నేను అనేక చిన్న పాటలను సేకరించి 1929లో భారతిలో ప్రకటించేను. వీటిని ఆ మరుచటి సంవత్సరమే పుస్తకంగా అచ్చువేసేను. అంతేకాదు నా మిత్రులైన నేదునూరి గంగాధరం గారిని ప్రోద్బలంచేసి కొన్నిటిని సేకరింపించి, వాటిని నాకియ్యగా నేను వాటిని శ్రమపడిసవరించి భారతి గృహలక్ష్మి పత్రికలలో ఆయనపేరునే ప్రకటించేను. ఈ రకపు వాఙ్మయంయొక్క తీపి దేశంలో నాలుగు మూలలా అంటుకొంది. అటు తర్వాత పుంఖానుపుంఖాలుగా అనేకపత్రికలలో ప్రకటించబడ్డాయి. నేను సేకరించిన పాటలలో కొన్నిటిని సాంప్రదాయిక విజ్ఞానం మొదటిభాగం అనుపేరున 1941లో పుస్తకంగా ప్రకటించేను. ఈ ఉద్యమాన్ని గురించి కొంత విపులంగా ఖండ గేయాలు అనే శీర్షికక్రింద ఉత్తరోత్తర చర్చిస్తాను.

## ఏది జానపద గేయం

విద్యాధికులు కానటువంటి సామాన్యజనుల ఆనందంకోసం,విజ్ఞానంకోసం జానపదవాఙ్మయం సృష్టింపబడింది. జాతి యొక్క ఆదిమస్థితిలో పండితులసలే వారులేరు. అటు తర్వాత అయినా భాషాపండితులు జానపదగేయాలను రాయవలసివచ్చినప్పుడు, సామాన్యజనుల అంతస్థుకి తగినట్టే రాసేవారు. దీనికి మినహాయింపులు అరుదు. కాబట్టి వారిరచనలో దీర్ఘసమాసాలు, కఠినపదాలు, వాడుకలోలేని సంస్కృతం, వాడుకలోలేని ఛందస్సు, క్లిష్టమైన అన్వయం ఉండేవికాదు. ఈ నియమాలను పాటించకపోతే అది పామరులకుగాక పండితులకే పనికివస్తుంది. కాబట్టి సర్వజనులకు అర్థంకావాలి అన్నది దీనిలో మొదటి సూత్రం. దీనిని బట్టే సులభశైలి, అందుబాటులో ఉండే లక్షణం ఇత్యాదులు జానపదగేయాలలో కనబడుతూంటాయి. ఇవిలేకపోతే జానపదగేయాలకి జానత (Popularity) రాదు.

ప్రజలలో జనత ఉండాలి అన్నది రెండోసూత్రం. ఎంతచక్కని రచనయైనా జానపదుల మనస్సులలో మెలగకపోతే దానికి జానపదగేయ యోగ్యతపట్ట లేదనే చెప్పాలి. తెలుగులో అనేకమంది గేయకారులు ఉద్భవించేరు. కొందరు పండితుల నోళ్లలో మాత్రమే ఉండి పోయేరు. క్షేత్రయ్య, త్యాగరాజు సిద్ధివేరు. వీరిద్దరు అటుసంగీతాన్ని ఇటుసాహిత్యాన్ని ప్రజల అందుబాటులోకి తెచ్చేరు.

ఆదికాలంనుంచి జానపదగేయాలలో సంగీత మొక భాగమే అని పాడుకోడానికి నిర్మించబడ్డాయి. కాని క్రమేపి సంగీతం ప్రత్యేక కళగా వృద్ధిచెందింది. క్షేత్రయ్య, త్యాగయ్య రచనలు సంగీతం యొక్క తుదిమెట్టును అందుకొన్నాయి.

ఆదినుంచి జానపదగేయాలలో సంగీతముండడం వల్ల ప్రజలకి లాభించినా, కొందరు లక్షణకర్తలకి

లోంగలేదు. అదివేరేకథ. పాడుకొనే గుణం ఉండబట్టే ఈ రకంవాఙ్మయం జనులకు అధిక ప్రియమయింది. త్యాగయ్య రచనలలోలాగు సంగీతం ఎంత అధికంగా ఉన్నా అవి జానపదగేయాలే యేయికాని మానలేదు. నిజంగా సంగీతాన్ని నిలిపిందీ, వృద్ధిపరచిందీ జానపద వాఙ్మయమే!

జానపదగేయాలకుండే లక్షణాలను అనుసరించి అనేకమంది లక్షలకొద్ది గేయాలను రాసేరు. కాని అవన్నీ ఏవి? కాలగర్భాన్నిచేరేయి. ఏవయితే నిజంగా జానపదగేయాలో అవే మిగిలేయి కాబట్టి ప్రజలమనస్సులో అతుకుకొని ఉండడం, జనత గలిగి ఉండడం జానపదగేయ సిద్ధిని నిర్ణయించే మరొక సూత్రం. ఎంతో ప్రసిద్ధిచెందిన గురుజాడ అప్పారావుగారు 'నీలగిరిపాటలు' అను గేయాలు రచించేడు. కాని ఆ పేరుగల ఒక పుస్తకం ఉందనికూడా సామాన్యంగా ఎవ్వరికీ తెలియదు. గురుజాడ గొప్పకవే! కాని ఆయన గేయకావ్యం ప్రజలలోకి ఎక్కక పోవడంవల్ల అది జానపదగేయం కాదని మనం నిర్ణయం చెయ్యవచ్చు. నండూరి సుబ్బారావుగారి 'ఎంకిపాటలు' మనుష్యుల స్మృతిలో ఉంది, పాడుకొని ఆనందిస్తూంటారు. దీనికి జానపదగేయ సిద్ధికలిగింది. ఆ ఎంకి పాటలను అనుకరిస్తూ మరికొందరు కవులు రాసేరు. వాటికి ఊరుపేరులేదు. నేటి గొప్ప జాతీయోద్యమకవియైన గరిమెళ్ల సత్యానారాయణగారు రచించిన 'మాకొద్దీతెల్ల దొరతనము' పాట దావాలంలాగు దేశంలో వ్యాపించింది. దానికి జానపదగేయ సిద్ధికలిగింది. ఆకవేరచించిన ఇతర పాటలు కొన్నిటిని లోకం ఎరగదు. ఈనాడు బుర్రకథలని పేరుపెట్టి కొందరు జానపదగేయలక్షణాలను అనుసరించి రచించేరు. ఈనాటి రచనలేకొన్ని పుస్తకాలలో మాత్రమే కనపడుతున్నాయి! ఏదయినా వీటి జానపదగేయగుణం కొంత కాలంపోయేకగాని తెలియదు. వీటిలో కొన్ని విపరీతరాజకీయ సిద్ధాంతాలకులోనై ప్రజలను అపమార్గాలలోకి కూడ పట్టిస్తున్నాయి.

జానపదకావ్యాలకి నికష పండితులమెప్పుకాదు పామరులలోని జనత!

## వర్గీకరణ

జానపదగేయాలను కొన్ని విధాలుగా వర్గీకరించవచ్చు. అన్నిటిలోకి ఉత్తమ విధానం యుగవిభజన. అనగా ఏ యుగంలో ఏది రచింపబడ్డదో నిర్ణయించి విమర్శించడం. కాని ఇది అంతసులువైనది కాదు. యుగాలుగా విభజించడానికి ముందు ఆ గేయాల కాలం నిర్ణయమవాలి. అది ఇప్పటిలో పూర్తిగా సాధ్యంకానిపని. రెండు, ఒక్కొక్క కావ్యాన్ని విడిగా విమర్శించి చేతనయినంతవరకు వాటిని కాలక్రమంగా ఏర్పరచడం. మూడు, గేయాలు స్థూలంగా ఎన్ని వాఙ్మయరకాల్లు (Types) గా ఏర్పడుతాయో చూచి, అనగా జంగం కథలు, పదాలు ఇత్యాదులుగా విభజించి ఒక్కొక్క గుంపును వేరే వేరే విమర్శించడం. ఇప్పుడీ విమర్శలో ఆ విధానమే అవలంబించ బడింది. ఇవి జంగంకథలు మొదలైన ఎనిమిది వర్గాలుగా-జంగంచరిత్ర కథల సంగతి పేరు - విభజించవచ్చని వెనకే తెలుపబడింది. ఈ వర్గాలలోని కొన్నిటి పేర్లనుకొంచెం విశదపరచవలసుంది. చిన్న చిన్న పదాలకు (ఖండకావ్యాలనే పేరు మాదిరిగానె) ఖండపదాలని పేరు పెట్టేను. పాతవాటికి కొన్నిటికి పూర్వపదాలని పేరుపెట్టేను. ఒకటి రెండు శతాబ్దాలకిందటే బయలుదేరిన ఒక శాఖకి అర్వాచీనపదాలని పేరు పెట్టేను. ఆ యాపదాలకింద వాటినిగురించి వివరంగా చెప్పబడుతుంది. మొదట జంగంకథా విమర్శ చూద్దాం. దీనిలో జంగంకథ అంటే ఏమిటో, దాని లక్షణాలు ఇత్యాదులు వివరంగా చెప్పబడతాయి.

—(౦)—




# అచ్చతెలుగు

శ్రీ సి. హెచ్. శ్రీరామమూర్తి

మా ఊళ్లో ఒక శాస్త్రులవారున్నారు. ఆయన తన స్నేహితులతో మాట్లాడేటప్పుడు 'మనం తెలుగువారమైయుండియు తెలుగు పూర్తిగ మాట్లాడుటలేదు. మన భాషను మనమే మన యిష్టము వచ్చినట్లు ఖూనీ చేయుచున్నాము. మనమెప్పుడును గ్రాంధికభాషలోనే మాట్లాడవలయును.' అనేవాడు. అప్పుడప్పుడు ఆయన చెప్పినట్లు శుద్ధతెలుగులో మాట్లాడేవాడు కూడ! ఆయన తన భార్యతో సయితము అచ్చ తెలుగు మాట్లాడేవాడు. పాప మీాయన భాష ఆమెకేమియు అర్థమయేది కాదు. అందరు అచ్చతెలుగు మాట్లాడవలెనని ఈయన వీధిలో బిచ్చగాళ్లతో కూడ గ్రామరు సహితమైన తెలుగులో మాట్లాడేవాడు. ఈయన తెలుగుపిచ్చ ఒక్కొక్కప్పుడు కొన్ని ప్రమాదాల్ని కూడ కల్గించేది!

ఒకరోజున ముష్టివాడొకడు శాస్త్రిగారింటికి వచ్చాడు. ఆరోజున శాస్త్రిగారింటిలో బియ్యంలేవు. అందుచేత ఆయన బిచ్చగానితో యిలా అన్నాడు. 'ఓరి! బిక్షకా! నేడుమాయింట తండులంబులు నిండుకున్నవి. నేనుబోయి రేపురమ్మా!'

ఈమాట వాడికర్థంనవక మళ్లా రెండు మూడు సార్లు 'బిక్షం పెట్టు' మని అరిచాడు. శాస్త్రిగారు మళ్లీ ఆ మాటే అన్నారు. దానితో ఆబిచ్చగాడికి కోపం వచ్చింది ఈయన అన్నమాట అర్థంకాక తన్ను తిడుతున్నాడేమో ననుకున్నాడు. 'పెడితె పెట్టాలి, లేకపోతే పొమ్మనాలి కాని, అనవసరంగా తిట్టడమెందు' కని వాడు పెద్దగోలచేస్తే నలుగురూ ప్రోగయి సంగతి తెల్సికొని, శాస్త్రిగారింట్లో బియ్యం లేవన్న సంగతి చెప్పి బిచ్చగాడిని పంపించి వేసారు.

మరొక రోజున శాస్త్రిగారు సంధ్య వార్చుకొంటుండగా ఒక పిల్లివచ్చి వంటింట్లోగిన్నెలో ఉన్నపాలు త్రాగివేయడం మొదలెట్టింది. అదిచూచి శాస్త్రి నూతి వద్దనున్న తన భార్యతో, 'గృహిణీ! మార్జాలంబు క్షీరంబులంగ్రోలుచున్నది.

దండంబు పుచ్చుకొని దండింపుమూ!' అన్నాడు.

కాని యీయన మాటలర్థంకాక ఆయన తనలో యేదో అనుకొంటున్నాడనుకొని, ఆవిడ తనపనిలో నుండి కదల లేదు. ఈలోపున మార్జాల చక్రవర్తి గిన్నెలోని పాలన్నిటిని పూర్తిగ పీల్చివేసింది. తరువాత శాస్త్రిగారి భార్య వచ్చిచూసి 'మీరిక్కడుండే పిల్లిపాలు త్రాగుతుంటే చూస్తూ ఊరుకున్నారా? శాస్త్రనన్ను కేకవెయ్యకూడదూ?' అంది.

ఇంకా యిటువంటివే రెండుమూడు నష్టాలు కలిగాయి శాస్త్రిగారి తెలుగు పిచ్చమూలాన అప్పటినుండి క్రమంగా శాస్త్రిగారు అచ్చతెలుగు మాట్లాడ్డం తగ్గించివేసారు. ఇప్పుడు శాస్త్రిగారు అచ్చతెలుగు పూర్తిగా మానివేశారు.

—o—

# సభలు, సమావేశములు



## కేసరి విద్యాలయముల వార్షికోత్సవము

మద్రాసు, ఏప్రిల్ 6—విద్యాశాఖా మంత్రి డాక్టర్ ఎమ్. వి. కృష్ణరావుగారి అధ్యక్షతను గత సాయంత్రం కేసరీ హైస్కూలు వ్యవస్థాపక వార్షికోత్సవం జరుపబడింది.

ఈ సందర్భంలోనే, ఈ స్కూలు వ్యవస్థాపకుడైన డాక్టర్ కె. ఎన్. కేసరీగారి 79వ జన్మదినోత్సవం కూడా జరుపబడింది. మంత్రులు శ్రీ రంగారెడ్డి, శంకరరెడ్డిగార్లు, విద్యాశాఖ డైరెక్టర్ శ్రీ ఎస్. గోవిందరాజులు నాయుడు మొదలైన అనేకమంది ప్రముఖులు ఈ ఉత్సవంలో పాల్గొన్నారు.

కేసరి విద్యాసంఘం ప్రెజరరు జస్టిస్ పి. సత్యనారాయణరావుగారు అతిథులకు స్వాగతం చెపుతూ, ఆంధ్రరాష్ట్రం విడిపోయిన తర్వాత మద్రాసులోని తెలుగు విద్యాసంస్థలకు దెబ్బ తగులుతుందేమోనని కొందరు భయపడుతున్నారన్నారు. అయనా, డాక్టర్ కేసరిలాంటి ఉదార పురుషులు తమ విద్యాసేవను సాగిస్తూనే వుండగలరని ఆశిస్తున్నామన్నారు.

ఈ సంఘం కార్యదర్శి శ్రీ బి. వి. శ్రీహరిరావు నాయుడు గారు వార్షిక నివేదికను చదివారు.

శ్రీమతి ఎమ్. వి. కృష్ణరావుగారు విద్యార్థులకు బహుమతులు పంచిపెట్టారు.

మంత్రి డాక్టర్ ఎమ్. వి. కృష్ణరావుగారు మాట్లాడుతూ, ఈ స్కూలు చేస్తున్న విద్యా సేవను కొనియాడారు. ఆంధ్ర రాష్ట్రం ఏర్పడ్డ తర్వాత తమబిడ్డల విద్యాభ్యాసానికి భంగంకలుగుతుందేమోనన్న భయం మద్రాసులోని ఆంధ్రులకు అక్కరలేదన్నారు. ఆంధ్రులకు, తమిళులకు మధ్య స్నేహసద్భావాలద్వారా ఇప్పుడున్న సౌకర్యాలు వేటికీ అభ్యంతరం వుండజాలదన్నారు.

వినోద ప్రదర్శనాలతో ఉత్సవం ముగిసింది.

## శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారికి సన్మానం

బాపట్ల, ఏప్రిల్ 5.-నేటి సాయంకాలం శ్రీ అన్నవరపు వారి బాలికా పాఠశాలయందు శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారికి సన్మానం జరుపుటకుగాను శ్రీ నోరి నరసింహశాస్త్రిగారి అధ్యక్షత క్రింద సన్మాన సభ జరుపబడింది. సభా కార్యక్రమం శ్రీ పాదిలి సత్యనారాయణావధానులుగారి స్వస్తి వాచకములతో ప్రారంభించబడింది.

సదస్యులను శ్రీమతి ప్రభావతి, మధుర భారతి గార్లు సంగీతంపాడి ఆనందింపజేశారు. సభాధ్యక్షులు ప్రథమమున మాట్లాడుతూ, తెలుగు వాఙ్మయమునకు శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు చేసిన సేవనుగూర్చి, ఆమె రచియించిన వివిధ గ్రంథాలను గూర్చి, వ్యాసావళినిగూర్చి ముచ్చటించారు.

పిమ్మట సన్మాన సంఘం తరఫున శ్రీమతి కర్లపూడి కమలాదేవిగారు, కవయిత్రి వరలక్ష్మమ్మగారికి పసుపుకుంకుమ, వస్త్రములతోసహా రు. 116 బహూకరించారు. తదుపరి శ్రీ వావిలాల సోమయాజులుగారు "స్త్రీల సాహిత్యమును" గూర్చి ఉపన్యసించారు. శ్రీమతి వరలక్ష్మమ్మగారు సన్మానానికి సమాధానం చెబుతూ బాపట్ల ప్రజలు తమయందు జూపిన ఆదరాభిమానములకు వందనము లర్పించారు. శ్రీ కూచిభొట్ల ప్రభాకరశాస్త్రిగారి జోహార్లతో సభా కార్యక్రమం, ముగిసింది.

## ఆంధ్రరాష్ట్ర మహిళాసభ వివరాలు

ఘంటసాల, ఏప్రిల్ 5 – ఆంధ్రరాష్ట్ర మహిళా మహాసభ ఘంటసాల గ్రామంలో ఆలంకమ్మ చెరువు వద్ద ఆహ్వాన సంఘంవారిచే అలంకరించబడిన

బ్రహ్మాండమైన పందిరిలో శ్రీమతి కె. లక్ష్మీరఘు రామయ్యగారి అధ్యక్షతను జరిగినది.

ఉదయం 8 గంటలకు వేలకొలది యువతులు మేళతాళాలతో ఊరేగింపు జరిపారు. పూలమాలలతో, నూలుదండలతో అధ్యక్షురాలు శ్రీమతి లక్ష్మీరఘు రామయ్యగారిని శ్రీమతి కడపరామసుబ్బమ్మగారిని సన్మానించారు.

10 గంటలకు విషయ నిర్ణయసభ జరిగింది. మధ్యాహ్నం 3 గంటలకు మహాసభ ప్రారంభమైనది. మహాసభను శ్రీమతి గోగినేని భారతీదేవిరంగా గారు ప్రారంభించారు. గ్రామీణ బీద ప్రజల సేవయే మన పరమావధి అని, దినమంతయు కష్టపడి పని చేసినను తిండికి, బట్టకు చాలక దారిద్ర్య మనుభవించు కోట్లాదిప్రజల రక్షణకై మనం పాటుపడాలని, అస్తులు విపరీతంగా పెంచుకొనుట, భోగాలాలసత్వంతగవని విషయు , పరిశీలన. సేవా పరాయణత్వం మహిళలు అలవరచు కొనవలెనని, సీత, సావిత్రి దమయంతి, అనసూయ, ఝాన్సీలక్ష్మీబాయి, కజిస్బు సతి సరోజినీనాయుడు మున్నగువారి అడుగుజాడలలో నడువ వలెనని, స్త్రీలు పురుషులు పరస్పర సహకారంతో జీవయాత్ర సాగించుకొనవలెనని ఆమె ఉద్బోధించారు.

అనంతరం మహాసభ అధ్యక్షురాలు శ్రీమతి లక్ష్మీరఘురామయ్యగారు అధ్యక్షోపన్యాసం చేశారు. శ్రీమతి సూర్యదేవర అన్నపూర్ణమ్మగారు, ఈడ్పుగంటి రత్నమాంబగారు, కె. వి. లక్ష్మీరెడ్డిగారు పలువురు ఉపన్యసించారు.

రాత్రి 10 గంటలకు ఘంటసాల బాలికాపాఠశాల విద్యార్థినులచే "స్త్రీ విద్య" అనేనాటికను ప్రదర్శించారు.

అనంతరం గొల్లపల్లి వాస్తవ్యురాలు శ్రీమతి చిట్టెమ్మగారి హాస్యరచనలతో మహాసభ ముగించబడినది. ఆహ్వాన సంఘసభ ఏర్పాట్లు భోజన వసతులు చక్కగా చేశారు.

జిల్లా, రాష్ట్ర మహాసభలు జరిగిన ప్రదేశానికి ఇకముందునుంచి 'భారతీరంగామైదానం' అని నామ కరణం చేశారు.

## వైశ్యసేవాసదన వార్షికోత్సవం

29-3-53 తేదీని రాజమండ్రి వైశ్యసేవాసదనము 33-వ వార్షికోత్సవము జరిగినది. సుప్రసిద్ధ కాంగ్రెసు వాదులు శ్రీయుత తుమ్మలపల్లి సత్యనారాయణ మూర్తిగారు అధ్యక్షత వహించిరి. సభసరిగా 5 గం||కు ప్రారంభమైనది. కార్యాదికారిణి శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు — అధ్యక్షులకు స్వాగత మర్పించి వార్షికోత్సవ నివేదికను చదివి వినిపించినారు. అధ్యక్షులు తమ ఉపన్యాసములో వైశ్య సేవాసదనము ఇంతకాలము నుండియు మహిళా లోకమునకు చేయుచున్న అమూల్య సేవనుగూర్చి ప్రశంసించుచు నిట్టి సంస్థలు ఇంకను పెక్కులు దేశమందు బయలుదేరిననాడు స్త్రీ లోకమంతయు చక్కని వైదుష్యమును బడయగలదని చెప్పియుండిరి. శ్రీమతి కోడూరి లీలావతీదేవిగారు "గృహపరిపాలనకు స్త్రీలు నేర్వదగిన శాస్త్రము" అను విషయమును గూర్చి, వేదవల్లి తాయారమ్మగారు "తెనుగు కావ్యాలలోని హాస్యరచన" అనుదానినిగూర్చి ఉపన్యసించిరి. ఈ విదుషీమణులకు శ్రీమతి కామాక్షమ్మగారు చీరలను బహూకరించినారు. తరువాత సదనవిద్యార్థినులచే నాట్యములు వినోదములు నాటకములు ప్రదర్శింపబడినవి. గయోపాఖ్యానములో కృష్ణార్జున పాత్రలను ధరించిన శ్రీమతులు లింగమల్లు సావిత్రి, బత్తుల సూర్యకాంతంగార్లకు అధ్యక్షులు రజత పాత్రలను బహూకరించినారు. హిందీనాటకములో మాతృ శ్రీ పాత్రను ధరించిన లింగమల్లు సావిత్రి గారికి అధ్యక్షులు వేరొక రజతపాత్రను బహూకరించి యున్నారు. శ్రీమతి కామాక్షమ్మగారి వందన సమర్పణతో సభ ముగిసినది.




# మలమూత్ర బద్ధకములకు చికిత్స

మలమూత్ర బద్ధకములకు అనేక కారణములుండవచ్చును. ఒక్కొక్కసారి యివి ప్రాణాపాయస్థితికి కారణములగుచుండటంకద్దు. ఈ సందర్భంలో వైద్యులచికిత్సకు ముందు మనకందుబాటులోనుండు మూలికలు, కాయకసుతులు, ఓషధులతో ప్రథమ చికిత్సచేసికోడానికి తెలిసికొనియుండటం మంచిది.

ఆముదం సర్వసాధారణంగా లభించేది. కొద్దిగా పుదినా ఆకుకలిపి వెచ్చజేసి పరిమితంగా సేవిస్తే మలమూత్రములు సాఫీగా జారీయగుతవి.

అల్లపుమురబ్బా మలమూత్ర విసర్జనకు విశేషంగా తోడ్పడుతుంది. అల్లమును పచ్చడిగా చేసికొని ఆహారంతో భుజించేటప్పుడు సయితం చక్కెర జేర్చి తీసికొనవలెను.

కరక్కాయలను కాల్చి పగులగొట్టి వేరుజేసినతోళ్లను రెండు మొదలు 4 చిన్నముల ఎత్తు దినమునకు రెండుసార్లు సేవించినచో మలమూత్రములు సాఫీగా జారీయగును.

కర్పూరశిలాజిత్తు అమృతతుల్యమైనది. అది సర్వరోగహారము. దానిని పూటకు 1 మొదలు 4 చిన్నముల ఎత్తువరకు చక్కెరతో కలిపి దినమునకు రెండుసార్లుసేవిస్తే ఆరోగ్యము అభివృద్ధిగాంచుతుంది. మలమూత్రబద్ధకము నివారణమగుతుంది.

వేపచెట్లలో తురకవేపయనునది ఒకతెగ. దాని ప్రతిభాగము వైద్యమునకు విశేషముగా నుపయోగపడుతుంది. దాని యాకులరసము మలమూత్ర విసర్జనకు చాల మేలుచేయును. మోతాదు 5,6, తులములఎత్తు. దినమునకు రెండుపూటల సేవించవలెను.

ద్రాక్షపండ్ల కషాయం ఆహారంగాను, ఔషధంగానుకూడ నుపయోగపడుతుంది. ముఖ్యంగా విత్తుల ద్రాక్షకషాయం చాలశ్రేష్ఠమైనది. మలమూత్ర విసర్జన ధారాళంగా జరిగేలాగ తోడ్పడుతుంది.

—o—

సి. సి. పున్నయ్య

# చెరగని సత్యం

★ శ్రీ చంద్రశేఖర్ ★

కోటమ్మ, తన ఒక్కగాని ఒక్క కొడుకైన వాసుతో రామన్న పాలెంలో నివసిస్తోంది. వాసు అక్కడున్న ఓ వీధిబడిలో, అయిదో తరగతి చదువుతున్నాడు. కోటమ్మ అక్కడక్కడా పనిచేసి కాలం గడుపుతుండేది. ఒకరోజున కోటమ్మ వాసూని పిలిచింది వంటింట్లోనుంచి. వాసు చదువుతోన్న పుస్తకాన్ని అక్కడే పెట్టి అమ్మదగ్గరకెళ్ళి "ఎందుకే" అనడిగాడు.

"ఏం లేదురా బాబూ! తాలింపులోకి మెంతులైపోయాయి, ఓకాని మెంతులు పట్టుకురారా." అంది మూలున్న బొట్టు పెట్టెలో 'కానీ' తీస్తూ.

"ఆ! నీకెప్పుడూ, నేను చదువుకొనేప్పుడే పనులన్నీ జ్ఞాపకం వస్తాయి, ఉత్తప్పుడు ఏమీ చెప్పవు." అని నసిగినా వెళ్ళక తప్పిందికాదు. అప్పటికే చీకటి పడినా, రోజూ తిరిగే ప్రదేశమవడం చేత భయం లేకపోయింది. కాని మాష్టారు పాఠం చదువుకురాని వాళ్ళని గోడకుర్చీ వేయిస్తానన్నారు. తనకు సగంవరకు పాఠం వచ్చింది. యింకాసగం రావాలి అంతలో వాళ్ళమ్మ పనిచెప్పింది. అయినా త్వరగా వచ్చి చదువుకోవాలని గబగబ నడిచి వెళ్తున్నాడు.

ఊళ్ళో బోర్డువారి బుడ్డిదీపాలు, గుడ్డిగా వీధి మొగల్లో వెలుగుతున్నాయ్. దారి సరిగ్గా కనబడటంలేదు. షావుకారింటికి వెళ్ళడానికి యింకా 'వంకా' వారి సందు మలుపు తిరగాలి. మలుపు దగ్గర ఏదోకనిపించింది రాయిలా. కాని నీడేమోనని ముందుకు వెళ్ళుతుంటే, కాలికేదో మెత్తగా తగిలింది. ఒక్కసారి గుండె ఘుతుక్కుమంది. మొదటది కుక్కేమో ననుకున్నాడు. కాని ఎటువంటి అలికిడి వినరాకపోయేసరికి, కొంచెం ధైర్యం చిక్కబట్టుకొని, చేత్తో పైకెత్తి చూసాడు. అదొక సంచి, సంచి బరువుగా వుంది. చుట్టుపట్ల చూసాడు, ఎవరూ కనిపించలేదు. తిన్నగా యింటికి వచ్చాడు. దీపం ముందు కూర్చొని సంచి విప్పుతుంటే, వాళ్ళమ్మవచ్చింది. "ఏమిటిరా! చేస్తుంది" అనడిగింది. వాసుకు సమాధానం చెప్పాలని కూడా తోచలేదు. మూటలాంటి సంచివిప్పి, సంచిలోంచి కాగితాలేవో పైకి తీసాడు. దీపం వెల్తుర్లో రూపాయి నోట్లుగా గుర్తించి యిద్దరూ ఒక్కసారి ఆశ్చర్యపోయారు. కోటమ్మ భయంతో అవన్నీ

లోపలపెట్టి సంచికట్టేయమంది. కాస్త స్థిమిత పడింతర్వాత.

"ఎక్కడిదిరా?" అనడిగింది.

"దొరికాయి" అన్నాడు.

"నిజంగా చెప్పరా బాబూ! ఎక్కడైనా ఎత్తుకొచ్చావేమో, వెళ్ళి, వాళ్ళ కాళ్ళమీదపడి క్షమించమంటా?" అంది అదొకరకమైన భీతితో.

"ఎత్తుకురాలేదే, నిజంగానేనే! ఆ 'వంకా' వారి సందు మలుపు తిరుగుతోంటే కాలికి తగిలింది, ఏమిటాని చూస్తే సంచిమూట, చుట్టూచూచా కాని ఎవరు కనబడలా, అందుచేత తీసుకొచ్చా, కాలికి తగిలినప్పుడు కుక్కేమోనని భయపడ్డా కూడా" అన్నాడు జరిగిందానిలో తన తప్పేమీ లేదని ఋజువు చేసుకొంటూ.

"సరే! రేపు అడుగుదాంలే, పాపం! ఎవరు పోగొట్టుకొన్నారో!" అంది జాలిగా.

వెంకట సుబ్బయ్య ఆవూళ్ళో డబ్బున్న కోమటి. కాని తగని పీనాసి. ప్రతి సంవత్సరం నల్లబజారో, తెల్లబజారో చేసి, పది, పదిహేను వేలు సంపాయిస్తాడు. కాని పైకిమాత్రం సామాన్య కుటుంబీకుడులా ఉంటాడు. ఆరోజుల్లో బేరన్ పుగాకు వ్యాపారం మహాజోరుగా నడుస్తోంది. వెంకట సుబ్బయ్యకూడా, ఆవ్యాపారం మీదకు మళ్ళాడు. ఒక సంవత్సరం కన్న, మరో సంవత్సరం ఎక్కువ లాభాలు రాబట్టేవాడు. ఆరోజు పుగాకు అమ్ముకొని వచ్చినడబ్బు సంచిలో మూట కట్టుకొని, ఏదో ఆలోచిస్తు, వస్తూంటే దారిలో ఎక్కడో మూట జారిపోయింది. ఇంటికొచ్చి చూసుకొన్నాడు-సంచిలేదు. సగం ప్రాణం పోయినట్టయింది. కంగారుగా పొగాకు అమ్మినకంపెనీ దగ్గరకు పరుగెత్తుకెళ్ళాడు. లాభం లేకపోయింది.

ప్రొద్దున్నే ఎట్టాడ్ని పిలిపించి "ఫలానా వెంకట సుబ్బయ్యగారి సంచితో కట్టిన వెయ్యి రూపాయలు రాత్రి ఎక్కడో పోయాయి దొరికినవారు తెచ్చి స్తే, రెండువందల రూ పా యి లు యి నాం యిస్తారు!" అని చాటింపించాడు వూరంతా.

ఈచాటింపు వెంకమ్మ కూడా వింది. సంచితోసహా వాసుని వెంటబెట్టుకొని వెళ్ళింది. "బాబూగారూ! యిదుగోనండి మీడబ్బు, రాత్రి మాఅబ్బాయి మెంతులు తేవడానికెడుతుంటే దొరికిందండి, మీరు యిస్తానన్న యీనాం యిస్తారా" అనడిగింది సుబ్బయ్యని.

సుబ్బయ్య తనడబ్బు సంచిని గుబుక్కున అందిపుచ్చుకొని, సంతోషంతో డబ్బంతా లెక్కపెట్టుకొన్నాడు. సరిగ్గా వుంది. కాని అంతలో ఏదో తట్టింది. యివ్వవలసిన యీనాం వృత్తినే యిస్తు

న్నట్లనిపించింది. ఎలాగైనా ఎగనామం పెట్టాలనుకొన్నాడు. ఏదో పోగొట్టుకున్న వానిలా ముఖం చిట్లించుకొని, గాభరా పడుతూ,

''అరే, దీంట్లో కొత్త గడియారం వుండాలి, నిన్నే రెండువందలు పెట్టి కొన్నా. అది లేదే, అది తీసుకొస్తే యీనామం యివ్వడానికి నాఅభ్యంతర మేమీలేదు'' అన్నాడు. తనడబ్బు చేతికి దొరికిందనే గర్వంతో కోటమ్మ ఎంతనిజం చెప్పినా వినలేదు. సుబ్బయ్య డబ్బుమాత్రం తన దగ్గరే వుంచుకొని పొమ్మన్నాడు.

కోటమ్మ చేసేదిలేక, గ్రామమునసబు గారి దగ్గర కెళ్ళి, జరిగిందంతా విన్నవించుకొంది. కోటమ్మంటే మునసబుగార్కి కూడా అభిమానమే, కోటమ్మ ఎప్పుడూ సత్యం చెప్పుతుందని తెలుసు. వెంకట సుబ్బయ్యమీద యిదివరకే రెండు నేరాలొచ్చాయి, కాని సరియైన సాక్ష్యం లేక పోయేసరికి, వెంకట సుబ్బయ్య మాటే గెలిచింది. మున సబుగారు 'సరే' అని ఎట్టాడ్ని, వెంకటసుబ్బయ్యని, పిలిపించాడు. మునసబుగారు జరిగిన విషయమంతా విశదంగా విన్నారు.

''అయితె, యీమె యినాం యిచ్చావా'' అనడిగాడు సుబ్బయ్యని.

''ఇప్పుడే గదండి చెప్పింది దానిలో గడియారం ఉండాలి - లేదు. అది యిస్తే యీనాం యివ్వడానికేమీ అభ్యంతరం లేదు'' అన్నాడు. తను యిదివరకు రెండు సార్లు గెలిచానునే ధైర్యంతో గర్వంగా మాట్లాడాడు.

''ఒరే ఎట్టీ, అసలు ఏమని చాటింపు వేశావురా'' అనడిగాడు.

''ఫలానా, వెంకటసుబ్బయ్యగారివి, సంచితో కట్టిన వేయిరూపాయలు, రాత్రి ఎక్కడో పోయాయి దొరికినవారు తెచ్చిస్తే, రెండువందల రూపాయిలు యినాం యిస్తారని! అని చాటించానండి'' అన్నాడు, తనవల్ల తప్పులేదనట్టు చేతులు దండకట్టుకొంటు.

దాంతో మునసబుగారు కోపంతో ''అయితే, వెంకటసుబ్బయ్య చాటింపు వేయించినప్పుడు, ఎంతడబ్బు పోయిందో వేయించావు. అయితే గడియారం వుందని ఎందుకు చాటిపించలేదు. నీగడియారం ఈసంచిలోలేదు అంచేత ఈసంచినీది కాదు. నీసంచి యింకొకర్కి దొరికుండాలి. ఈసంచి ఈమెకు దొరికిందంటుంది కాబట్టి వారం రోజుల్లో ఈసంచికోసం ఎవరూ రాకపోతే, ఆమెకే చెందుతుంది'' అని తీర్పు చెప్పేసరికి సుబ్బయ్య వంటినిండా జెర్రిలు ప్రాకినట్లైంది. ఆమర్నాడే కోటమ్మకి యినాం యిచ్చి మిగిలిన డబ్బు తెచ్చుకున్నాడు గుప్ చిప్‌గా.

——(o)——

# నాకా అదృష్టం లేకపోయింది!



అది శివం హాస్పిటల్ నుండి డిస్చార్జి అయ్యేరోజు. ఆరోజు అచ్చటి పని వాళ్లంతా తమ మామూళ్ల కోసం చేతులు జాచారు. విశ్వం 1 రూపాయ చిల్లర మార్చి అందరికి పంచి పెట్టాడు. కాని ఒకనల్ల దుస్తులు ధరించిన వ్యక్తిమాత్రం వీటితో సంబంధం లేనట్లు నిలుచుకొని యున్నాడు. విశ్వం అతని యొద్దకెళ్లి "అందరు నావద్దకు వచ్చి చెయ్యి జాస్తూంటే, నీవు మాత్రం ఊరుకున్నావేమి?" అని అడిగాడు. అందుకు అతడు, "మీరుగాని ఆస్పత్రిలో చచ్చిపోయివుంటే నేను, మీ శవాన్ని కాపలాకాచి మీవాళ్లు వచ్చిన తరువాత వారికప్పగించి వారియొద్దనుండి 1 రూపాయ తీసికొనేవాడిని. కాని నాకా అదృష్టం లేకపోయింది," అన్నాడు విచారంగా.

'ఎన్నెస్'

—(o)—

# స్త్రీల సాంఘిక, ఆర్థిక ప్రతిపత్తి పెరుగుదలకు కృషి



## కృష్ణాజిల్లా మహిళామహాసభలో శ్రీమతి కడప రామసుబ్బమ్మగారి ప్రబోధం

ఘంటసాల. ఏప్రిల్ 4—కృష్ణాజిల్లాదివి తాలూకా ఘంటసాలలో నేడు జరిగిన ఎనిమిదవ కృష్ణాజిల్లా మహిళా మహాసభకు శ్రీమతి కడప రామసుబ్బమ్మగారు ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంలో ఆమె ఇలా ఉపన్యసించారు.

"తెలుగుజాతి చరిత్రలో ఒక అతిముఖ్య ఘట్టంలో మన మిప్పుడు సమావేశమవుతున్నాం. ఇంకొక ఆరు మాసాలకు లోపుగా మన రాష్ట్ర అవతరణను మనం కళ్ళారు చూచి, ఆనందించే భాగ్యంమనకు కలుగబోతూవుంది. ఈ సంఘటన మన తరంలోనే జరగడం మన అదృష్టం. ఇకమీదట మన తెలుగు గడ్డలోనున్న మన ప్రభుత్వ కార్యాలయాలలో, న్యాయ స్థానాలలో, శాసనశభలలో తెలుగులోనే కార్యాకలాపాలు అన్నీ జరిపించబడటం మనకెంతో సంతోషం. ప్రభుత్వ వ్యవహారాలు స్వభాషలో జరిగే ఈ విధానము మననారీ విజ్ఞాన వికాసాలకు తోడ్పడగలదు."

"మనకు ప్రత్యేక రాష్ట్రాన్ని యిప్పటికైనా ప్రసాదించినందుకు కేంద్ర ప్రభుత్వానికి మన ధన్యవాదాలు అర్పిద్దాం. ఆంధ్రుల ద్రవ్యంతో, వారి సేవతో నిర్మించబడి, ఆంధ్ర వణిక్ ప్రముఖులతోను వృద్ధిగావించిన మన మదరాసు నగరంలో మనకున్న హక్కులను గుర్తించుటకు నిరాకరించి, ఆ మహానగరాన్ని పూర్తిగా తమిళులకే కట్టబెట్టిన ప్రభుత్వ అన్యాయపై ఖరిని మనం విమర్శించకుండా వుండజాలం. ఈ విషయములో మన మహానాయకుడు నెహ్రూ పండితుడు పునరాలోచనచేసి, ఆంధ్రులకు జరిగిన యీ అన్యాయాన్ని తొలగించగలడని ఆశిస్తున్నాము."

"నూతనాంధ్ర ప్రభుత్వం యాజమాన్యాన ఆంధ్రావని సర్వతోముఖాభివృద్ధి గాంచాలంటే మన రాష్ట్రంలో సుస్థిరమైనట్టి ప్రజాస్వామ్య పద్ధతులలో విశ్వాసమున్నట్టి అన్ని రాజకీయ పార్టీలు ఏకమై సుస్థిర ప్రభుత్వాన్ని ఏర్పరచాలి. ఆంధ్రులలో ఇప్పటివరకున్న సమైక్యత చాలదన్న విషయం మనంగుర్తించాలి. ఈ లోపాన్ని మనం వెంటనే సవరించుకొని నూతన ఆంధ్రరాష్ట్రావతరణ సందర్భంలో ఉద్భవిల్లే అనేక సమస్యలను మనం విజ్ఞతాపూర్వంకగాను. యావదాంధ్ర శ్రేయోదాయకంగాను పరిష్కరించుకోవాలి."

"జనాభాలో సగానికి తక్కువగాని మహిళలం సాంఘికార్థికాది విషయాలలో పురుషులకన్న చాలా వెనుకబడివున్నాం. ఈ శోచనీయ స్థితి మారాలంటే అనేక ఆచార సంప్రదాయాలు, శాసనాలు, మనకు అనుకూలంగా మారాలి. అఖిల భారత మహిళా సంఘం, దాని శాఖలైన మన ఈ సంస్థలు గడచిన 28 సంవత్సరాలనుండి ఈ విషయంలో నిరంతర ఆందోళన చేస్తున్నవి. మన మహిళా సంఘాలు చాలా పటిష్టిమై, సమర్థంగా పనిచేయగలిగిన నాడు మన నారీలోకం తన ఆశయాలను సఫలం చేసుకోగలదు. కనుక సోదరీ మణులెల్లరు అఖిలభారత మహిళా సంఘం దాని అనుబంధ శాఖలలో విరివిగా సభ్యురాండ్రుగాచేరి, వాని కార్యక్రమములలో చురుకుగా పాల్గొని, అవి మన స్త్రీలోకానికి పూర్తిగా ప్రాతినిధ్యం వహించే సంస్థలుగా వానినిమనం రూపొందించాలి. దేశనాయకులు, ప్రభుత్వాలు ఈ సంస్థలద్వారా

మనం తెలియజేసే కోర్కెలను విధిగా గౌరవించి, మన్నించేస్థాయికి వీనిని మనం తీసుకొని రావాలి. అప్పుడే మనం నవ మహిళా ప్రపంచాన్ని చూడగలం.”

“కుల, మత, వర్గ, లింగ భేధాలు లేని వయోజన వోటింగుపద్ధతిద్వారా ప్రజానీకాని కందరికి రాజకీయ సమత్వం ఏర్పడింది. కాని, సాంఘికార్థికాది స్వాతంత్ర్యాలు మనమింకా సంపాదించవలసివున్నది. ఆస్తిపాస్తులలో యిప్పటికీ మన స్త్రీలకు చెప్పుకోదగ్గ హక్కులేవీ లేవు. హిందూకోడ్ వగైరా బిల్లులు మనం సూచించే సవరణలతో శాసనాలై మన ఆర్థిక ప్రతిపత్తిని పూర్తిగా మార్చివేస్తేనేగాని మనకు మోక్షం లేదు. ఆర్థిక స్వాతంత్ర్య సమత్వంలేని రాజకీయ ఓటింగ్ హక్కు మనలను ఎంతో ముందుకు తీసుకొని వెళ్ళలేదు. దేశవ్యాప్తమైనట్టి, వయోజన వోటింగ్‌తో కూడిన క్రిందటి ఎన్నికలు ఈ విషయంలో మనకొక గుణపాఠం నేర్పినవి. పార్లమెంటుకు రాష్ట్రశాసన సభలకు ఎన్నుకోబడిన మహిళామణులను వ్రేళ్ళపైన లెక్కపెట్టవచ్చును. పార్లమెంటుకు, శాసన సభలకు మన జనాభాకు తగినంతమంది స్త్రీలను మనం ఎన్నుకొన్ననాడే మనం సాంఘికార్థికాది సమస్యలు పరిష్కారం కాగలవు. కనుక ఆ సభలకు సగంమంది స్త్రీ సభ్యురాండ్రు యెన్నుకొనబడుటకు మనం ప్రయత్నించాలి. అందులకు అవసరమైన అన్నిచర్యలు మనం తీసుకోవాలి. సమర్థులు ఋజువర్తనులు, అవకాశం, విశ్రాంతివున్న సోదరీమణులు కొంతమంది అయినా యిందు కొరకు నిరంతరంకృషి చేయాలి.”

“మహిళల గృహనిర్వహణ బాధ్యత చాలా చిత్రమైనది: ఉత్కృష్టమైనది. ఆనందమయమైన గృహాన్ని నిర్మించి వీరనాయకులను, వీరయోధులను, పవిత్ర మాతృమూర్తులను సృష్టించి పోషించుతూ వుండవలసిన విశిష్టబాధ్యత మనది. సీత, దమయంతి అనసూయ, రుక్మిణీ-ఆదిగాగల పురాణ స్త్రీమూర్తులు, రుద్రమదేవి, ఝాన్సీరాణివంటి చరిత్ర ప్రఖ్యాత నారీమణులు మనకెప్పుడు ధృవతారలుగా వుండాలి. సత్సంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు మనకెప్పుడు శిరోధార్యాలుగా వుండాలి.”

“దేశ కాల పరిస్థితులనుబట్టి వానిలో కొన్ని మార్పులను మనం చేసుకుంటూ వున్నప్పటికీ నిత్యసత్యాలు అయినట్టి అసలు భారతీయ సంస్కృతీ సిద్ధాంతాలను మనం చెక్కుచెదరకుండా వుంచాలి. అప్పుడే మనం తరించి, ఈ సంక్షుభిత ప్రపంచాన్ని తరింపజేయ గలుగుతాం. కొన్నివేల సంవత్సరాల క్రిందట విరాగులు, విజ్ఞానులు, పతివ్రతా శిరోమణులు మనకు సృష్టించి అందజేసిన వాఙ్మయం సంప్రదాయాలు మనం మననం చేసుకొని ఆ ప్రకారం మన జీవితాన్ని సరిదిద్దుకోవాలి. మన జాతికి పవిత్ర ఆశయాలతోనిండి నిబిడీకృతమైనట్టి మాతృమూర్తియే వెన్నెముకవంటిది. కనుక ఆస్థితినుండి మన నారీలోకం పతనం కాకుండా మనం కాపాడుకోవాలి. అది మనం సాధించలేకపోతే మన జాతికి, దేశానికి భవిష్యత్తు లేదని మనం గ్రహించాలి.”

“మనం కనిపెంచే బిడ్డలు మహదాశయ పూర్తులుగాను, పవిత్ర తేజోమూర్తులుగాను వుండేటట్లు మనం సదా ప్రయత్నించాలి. విద్యాలయాలలోని విద్యకన్న తల్లి వొడిలోవుండి నేర్చుకొనే విద్యాబుద్ధులే పసికందుల హృదయాలలో గాఢంగా నాటుకోగలవు. స్త్రీ విజ్ఞాననిధి, పవిత్రమూర్తి అయితేనేకాని యిది సాధ్యపడదు. కనుక మనం త్యాగధనం, వైరాగ్యశీలసంపద అర్జనచేయాలి. మహిళోద్యమాలకు మనం యినుమడించిన వుత్సాహము, కార్యదక్షతతో సాగించిన గాని ఈ ఆశయం నెరవేరదు. మహిళా సంఘాలు ప్రతిగ్రామములో స్థాపించాలి. అందరు విరివిగా సభ్యులుగాచేరి అఖిలభారత మహిళాసంఘ ఆశయసిద్ధికి మనము ప్రత్యేకకృషి జరపాలి. ఈపని మహిళాసంఘాలలోని కార్యకర్తలమీదనే కాక సాధారణ మహిళ లందరి మీదనువున్నది.”

“నల్లమల పర్వతాల కిరుప్రక్కలవున్న రాయలసీమ కోస్తా ప్రాంతాలంతటా నూతనోత్సాహాలు వెల్లివిరిసే యావదాంధ్రాన్ని సరికొత్త చైతన్య కెరటాలతో ముంచెత్తివెయ్యాలి. సాంఘిక, ఆర్థిక, రాజకీయ, నైతికరంగాలలో మన తెలుగుగడ్డ యావత్తు భారతావనికి తలమాణిక్యముగా వుండాలి. ఇందు మన మహిళలదే ప్రధాన బాధ్యతై వుండాలి.”

# సంపాదకీయములు

## మద్రాసులోని తెలుగు విద్యా సంస్థలు

చెన్న నగరంలో తెలుగు విద్యా సంస్థలలోని కేసరి విద్యాలయముల పురోభివృద్ధి కార్యక్రమమును వివరించే నివేదిక (1952-53) యిందులో మరొకచోట ప్రచురించాము.

దినదిన ప్రవర్ధమానమగుచున్న యీ విద్యాలయములు నగరములోని ఆంధ్రుల ఆదరాభిమానములకు ఎలాగ పాత్రమగుచున్నవో గుర్తించతగినది.

ఆంధ్రరాష్ట్రం విడిపోనున్న యీ సందర్భంలో యిట్టి తెలుగు విద్యా సంస్థల భవిష్యత్తు, ఆంధ్రప్రజానీకపు భవిష్యత్తు కొంత ఆందోళనకరంగానున్నా నగరంలోని తెలుగువారు నిస్పృహచెంది అధైర్యపడటం కాదు నేడుచేయవలసినది.

నగరంలోని విద్యాలయాలలో తెలుగు తీసివెయ్యాలని ప్రభుత్వము ఆలోచిస్తున్నదట. ఈ పరిస్థితులలో తెలుగుభాషాభ్యాసానికి అవకాశములులేని నగరంలోని వివిధప్రాంతాలలో ప్రాథమిక పాఠశాలలను, అవసరమున్నచోట ఉన్నత విద్యాలయాలను స్థాపించుకోడానికి నగరంలోని తెలుగువారు నేటినుండే కృషిచెయ్యాలి. ఇందుకుగాను విశాలాంధ్ర ప్రజానీకంయొక్క సహకారాన్ని అర్థించడంకూడ అవసరం.

ఈ ప్రయత్నంలో కొందరు అప్పుడే కృషి చేస్తున్నారు. కొన్ని ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత పాఠశాలలు కొన్ని ప్రాంతాలలో ఏర్పడినవి. ఇంకా ఏర్పడవలసిన ప్రాంతాలు అనేకమున్నవి. ఇందుకుగాను కృషిచేయుచున్నవారిలో శ్రీ గుమ్మి నరసింహంగారొకరు. లయోలా కాలేజిలో ఆంధ్రభాషా ఉపన్యాసకులుగానుండి, ఈ విద్యాలయాల ఏర్పాటు కృషికిగాను తన ఉద్యోగమునకు రాజీనామాయిచ్చి అచంచలమైన దీక్షతో పనిచేస్తున్నారు. వారి విధి, విరామంలేని కృషి మూలంగా షెనాయినగరంలోను, నుంగంబాకంలోను వెంకటేశ్వర విద్యాలయమనే పేరుతో విద్యాసంస్థ లేర్పడి విజయవంతంగా సాగుతున్నవి. ఇంకా యితర ప్రాంతాలలో సయితం విద్యాలయాల ఏర్పాటుకు కృషిచేస్తున్నారు. వారికి నగరంలోను, ఆంధ్రప్రాంతంలోను విరివిగా సహకారసానుభూతులు దొరికితే నగరమొత్తంమీదనుండు బాలబాలికలకు తెలుగులో విద్యాబోధనకు యిబ్బంది యుండదు. యావదాంధ్రులు శ్రీ నరసింహంగారిని తమ స్వప్రయోజనానికి ఉపయోగించుకొంటారని మా నమ్మకం.

## మహిళలు — సంఘనిర్మాణం

ఘంటసాలలో జరిగిన 8వ కృష్ణాజిల్లా మహిళాసభలో అనేక సమస్యలనుగురించి చర్చలు జరిగినవి. మహిళా ఉద్యమ నాయకురాండ్రు ఉపన్యసించారు.

అధ్యక్షోపన్యాసములో శ్రీమతి భారతీదేవిగారు వ్యవసాయభూముల పంపకంలో స్త్రీ సంతానానికి భాగంకోరకూడదనియు, ఉత్పత్తి దెబ్బతినేలాగ కమతాల విభజన వాంఛనీయంకాదని సూచించారు.

శ్రీమతి కడప రామసుబ్బమ్మగారు ఆర్థిక సాంఘికరంగాలలో సమానహక్కుల కొరకు స్త్రీలు కృషిచెయ్యాలనియు, దాంతోబాటు ఆయా రంగాలలో ప్రతిపత్తి పెరిగేలాగ కృషికూడ చేయాలని ప్రబోధించారు.

 

పైరెండు విషయాలు అనుభవపూర్వకంగా చెప్పబడినవి.

హిందూ కుటుంబం యొక్క శ్రేయస్సు దృష్ట్యా స్త్రీలేమిటి, పురుషులేమిటి బాగా ఆలోచించి సాంఘిక పరిస్థితులను రూపొందించుకోడం అత్యంత ఆవశ్యం.

ఒక కుటుంబమున్నదంటే అందులోని మగ ఆడ సంతానమునకు విద్య అత్యంతావశ్యం. అనంతరము వారి వివాహాది కార్యాలున్నవి. వీని మంచిచెడ్డలు ఆర్థిక స్తోమతుమీద నాధారపడియుంటవి. ఈ పరిస్థితులలో కుటుంబంయొక్క ఆస్థిపాస్తులు విభజన జరుగకుండా ఉమ్మడిగానుండి, దానిమీద వచ్చేరాబడి కుటుంబ శ్రేయస్సుకు, పురోభివృద్ధికి ఉపయోగిస్తే కుటుంబంలోని సంతానానికి ఉన్నత విద్యా సౌకర్యాలు, శుభ కార్యాలుకాని, కుటుంబ అభివృద్ధికి వలసిన అభివృద్ధి ప్రణాళికలు కాని ఆర్థికలోపంలేకుండా నిర్వహించ బడటమేకాకుండా ఆస్థిపాస్తులు చెక్కుచెదరకుండా యుండి వ్యవసాయభూములలో ఉత్పత్తిదెబ్బతగలకుండా యుంటుంది.

పురుషసంతానం కాని, స్త్రీ సంతానంకాని, ఉన్నత విద్యా కుశలురై వారివారి కనుకూల రంగాలలో ధనార్జనప్రారంభిస్తే తాము సుఖప్రదమైన జీవనం గడుపడమేకాక ఉమ్మడికుటుంబంయొక్క ఆస్థిపాస్తుల పెంపకానికి వినియోగపడితే అది యాకుటుంబముయొక్క తరతరాలవారి యభివృద్ధికి ఉపకరిస్తుంది. పైగా ఆ కుటుంబంలో ఎవరైనా ఏ విధంగానైనా బలహీనులుగా నున్న పరిస్థితులలో వారికండదండగా నుంటుంది ఆ కుటుంబము. ఈ పద్ధతిమూలంగా సంఘంలో కట్టుబాట్లు, సంఘీభావము పెంపొందుతుందేగాని యీనాటి కలవరాలు, కలతలు పెంపొందవు. కాబట్టి సంఘశ్రేయస్సు దృష్ట్యా ఉమ్మడి కుటుంబ జీవితము వాంఛనీయం.

ఇక ఆర్థిక సాంఘిక రంగాలలో సమానహక్కులకొరకు ఆందోళన కృషిచేసేముందు ఆయారంగాలలో ప్రతిపత్తిపెరుగడానికి కృషి జరుగాలి. అంటే ఉమ్మడి కుటుంబంలో ఉన్నత విద్యాభ్యాసము చేయనవకాశముండు స్త్రీలు ఆ విద్యను, సంఘశ్రేయస్సును దృష్టిలోనుంచుకొని సద్వినియోగం చేస్తే అనేక సమస్యలు పరిష్కారమగుతవి.

పురుషుడు చేసే ప్రతియుద్యోగమును తాను చేయాలనే ఉబలాటం సమానహక్కులనిపించుకోవు. పురుషులు చేయలేనివి, పురుషులకంటే స్త్రీలే మెరుగుగా చేయగల ఉద్యోగాలు చాల యున్నవి.

బాలబాలికలకు విద్యాబోధకులుగా, వైద్యులుగా, నర్సులుగా, పత్రికారచయితలుగా, విజ్ఞానవేత్తలుగా, కళాకారులుగా సంఘఔన్నత్యానికి, పురోభివృద్ధికి స్త్రీలు విశేషంగా కృషిచేయవచ్చును. వీరికృషివలన ప్రపంచం శాంతి అభ్యుదయాలకు మరింత సమీపమగుతుంది. అంతేకాక శ్రీమతి రామసుబ్బమ్మగారు ప్రబోధించిన ఆర్థిక సాంఘిక రంగాలలో పురుషులతోబాటు ప్రతిపత్తి పెరుగుదలకు అవకాశమున్నది. అయితే ప్రజలు ప్రభుత్వము యీసందర్భమున రెండు విషయాలు గుర్తించాలి – మహిళావిద్యా విధానంలో మార్పురావాలి; హక్కులను గురించి రాయిగుద్ది మాట్లాడేముందు యదార్థపరిస్థితులను ముందుంచుకొని బాధ్యతలను గుర్తించి వ్యవహరించాలి. ఇందుకై మహిళా ఉద్యమం సయితం కృషి చెయ్యాలి.

శ్రీమతి గొట్టిపాటి మహాలక్ష్మమ్మగారు హిందూకోడ్ బిల్లు ఆమోదించబడేలాగ ఆందోళన జరుగాలని ప్రబోధించారు. అయితే హిందూ సంస్కృతి, నాగరికతల విశిష్టతకు భంగం రాకుండాయుండి, సాంఘికంగా కట్టుబాటు, నైతిక ప్రవృత్తులు అభివృద్ధి అయ్యేట్లయితే యీబిల్లు చట్టం కావలసిందే. ఇవి దెబ్బతింటే మాత్రం సంఘం, తద్వారా దేశం పతనం చెందడం తథ్యం.

—o—

# శ్రీ విజయనామ సం॥ర అధిక-నిజవైశాఖమాసములు

| | | | |
|---|---|---|---|
| 1953 సం॥ ఏప్రిల్ నెల | 16 | గు | తృ 37-39 - కృ 41-29 త్యా 12-39 |
| | 17 | శు | చ 36-10 - రో 41-26 త్యా 21-29 శ్రీ విల్లి పుత్తూర్ ఉత్సవారంభం |
| | 18 | శ | పం 36-21 - మృ 42-33 త్యా 55-26 |
| | 19 | ఆ | ష 35-56 - ఆ 44-54 త్యా 3-33 శ్రీ పెరంబూదూర్ శాత్తుమురై |
| | 20 | సో | స 39-8 - పున 48-29 త్యా 14-54 |
| | 21 | మం | అ 40-35 పుష్య 53-11 త్యా 8-29 |
| | 22 | బు | న 44-45 - ఆశ్లే 58-49 త్యా 25-11 |
| | 23 | గు | ద 50-4 - మఖ 60-0 త్యా 28-49 |
| | 24 | శు | ఏ 52-53 - మఖ 4-58 త్యా 24-58 |
| | 25 | శ | ద్వా 57-4 - పూఫ 11-26 త్యా 29-26 |
| | 26 | ఆ | త్ర 60-0 - ఉఫ 17-25 త్యా 38-25 |
| | 27 | సో | త్ర 1-22 హ 23-32 త్యా 43-32 |
| | 28 | మం | చ ○ 5-21 చి 28-26 త్యా 42-26 |
| | 29 | బు | పౌ 10-16 స్వా 32-17 త్యా 46-17 |
| | 30 | గు | కృ.ప్ర 11-4 విశా 34-55 త్యా 44-55 తిరువల్లికేణి గరుడోత్సవం |
| 1953 సం॥ మే నెల | 1 | శు | ద్వి 12-3 అ 36-18 త్యా 50-18 |
| | 2 | శ | తృ 12-11 జ్యే 36-28 |
| | 3 | ఆ | చ 9-53 మూల 35-32 త్యా 32-28 |
| | 4 | సో | పం 7-6 పూ.షా 33-38 త్యా 53-38 |
| | 5 | మం | ష 2-52 ఉ.షా 30-57 త్యా 40-57 |
| | 6 | బు | అ 53-4 శ్ర 27-37 త్యా 37-37 శ్రీ వైకుంఠ గరుడోత్సవము |
| | 7 | గు | న 46-50 ధని 23-50 త్యా 51-50 కంచి కైలాస ఉత్సవము |
| | 8 | శు | ద 40-20 శత 19-47 త్యా 35-47 |
| | 9 | శ | ఏ 33-50 పూభా 15-43 త్యా 39-43 |
| | 10 | ఆ | ద్వా 27-12 ఉభా 9-32 త్యా 39-32 |
| | 11 | సో | త్ర 21-23 రేవ 8-10 త్యా 58-10 మాసశివరాత్రి |
| | 12 | మం | చ 13-43 అశ్వ 5-9 - త్యా 29-9 |
| | 13 | బు | ● అమా 11-26 భరణి 2-50 - త్యా 32-50 |
| | | | నిజ వైశాఖమాసం |
| | 14 | గు | శు.ప్ర 9-10 కృ 1-5 - త్యా 41-5 చంద్ర దర్శనం |
| | 15 | శు | ద్వి 8-32 రో 1-26 - త్యా 15-26 |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd., 15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.

ఏప్రిల్
విడుదల



అజంతా...

# వయ్యారిభామ

వరలక్ష్మి, సులోచన, నాగేశ్వరరావు, సి.ఎస్.ఆర్

డైరెక్టర్... పి. సుబ్బారావు

CH. E. PRASAD

డిస్ట్రిబ్యూటర్లు:— ఆంధ్ర : అజంతాఫిలిమ్సు - విజయవాడ; సీడెడ్ : వసంతపిక్చర్సు - గుంటకల్.
నైజాం : సుందర్ పిక్చర్సు సర్క్యూట్ - సికింద్రాబాదు; మైసూర్ : విజయాటాకీస్ డిస్ట్రిబ్యూటర్సు - బెంగుళూరు.
ఇతర వివరాలకు:— అజంతాపిక్చర్సు— మద్రాసు-20.

Lodhra Press, Madras - 14.